

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ—ఆంధ్ర, హైదరాబాదు

## ప్రచారకులకు విజ్ఞప్తి

# అమృత హిందీ మౌఖిక పరీక్షా కార్యక్రమం

దక్షిణ భారత హిందీ ప్రచార సభ స్థాపించబడి 75 సంవత్సరములు పూర్తి అయిన సందర్భంగా సభాధ్యక్షులు, భారత ప్రధాని గౌ. శ్రీ పి. వి నరసింహారావు గారు మార్చి నెలలో సభ అమృతోత్సవముల ప్రారంభోత్సవము చేసినారు. తదనంతరము దక్షిణాది నాలుగు రాష్ట్రములలో సభ అమృతోత్సవములు జరుగుచున్నవి. ఆంధ్రరాష్ట్రంలో ఈ సభం ప్రారంభోత్సవము జూన్ నెలలో విశాఖపట్టణం నగరము నందు ఆంధ్రప్రదేశ్ విద్య శాఖామాత్యులు డా॥ పి. వి. రంగారావు గారి కరకమలములచే గావింపబడినది. ఈ పరంపరలో ఇప్పటి వరకు విశాఖ, విజయనగరం, కృష్ణ, పశ్చిమగోదావరి, కడప, తూర్పు గోదావరి, అనంతపురం జిల్లాలలో జిల్లా అమృతోత్సవ మహాసభలు జరిగినవి. ఈ కార్యక్రమము మిగితా జిల్లాలయందు కూడ ఉత్సవములు జరుగనున్నవి. చివరగా రాష్ట్రస్థాయిలో హైదరాబాదులో పెద్ద ఎత్తున జరుగును.

సభ అమృతోత్సవముల సందర్భంగా అమృత హిందీ మౌఖిక పరీక్ష జత ఆగష్టు 92 నుండి ఆరు పర్యాయములు ఆంధ్రప్రదేశ్ అంతటా విజయవంతముగా నిర్వహింపబడినదని తెలియజేయుటకు ఆనందిస్తున్నాము. ఈ కార్యక్రమములో ఇంకనూ ఎక్కువ ఉత్సాహము చూపుటకు గనూ, ఇంకా ఎక్కువ సంఖ్యలో విద్యార్థులు అమృత హిందీ మౌఖిక పరీక్షకు కూర్చొనవలెనను ఉద్దేశ్యముతో ఇక ముందు అనగా జూలై 94 నుండి ప్రతి నెలాఖరు రోజును ఆయా కేంద్రములలో 'అమృత హిందీ మౌఖిక పరీక్ష' నిర్వహింపబడును.

అయితే 400 మంది విద్యార్థులను తయారు చేసిన ప్రచారకులను ఈ సభలలో సన్మానించుట జరుగుచున్నది. ఇంతవరకూ జరిగిన జిల్లా మహాసభలలో 400 మంది విద్యార్థులను తయారు చేసిన ప్రచారకులు సన్మానించబడిరి. ఇంతటితో ఆ జిల్లాలలో ఉత్సవములు ముగిసినంత మాత్రమున అమృత మౌఖిక పరీక్షా కార్యక్రమము ఆగదు. ఇంకనూ ఈ కార్యక్రమము నడుచును. కావున ప్రచారకులందరూ ఈ అవకాశమును వినియోగించుకొని అధిక సంఖ్యలో విద్యార్థులను తయారుచేసి హిందీ ప్రచార ఉద్యమానికి తోడ్పడగలరు. జిల్లా ఉత్సవాలు అయిపోయినప్పటికి ఆ జిల్లాలలో తర్వాత 400 మంది విద్యార్థులు తయారు చేసిన ప్రచారకులను రాష్ట్రస్థాయి ఉత్సావాలు జరుగునప్పుడు సన్మానించబడును. అందుచే ఉత్సవములు జరిగిన జిల్లాలోని ప్రచారకు లందరు ఈ సదవకాశమును ఉపయోగించుకొని ఇంకనూ అధిక సంఖ్యలో విద్యార్థులను తయారు చేసి సభ తరపున సన్మానము పొందగలరు. హిందీ ప్రచారోద్యమంలో తమ సహాయ సహకారాలు సదా లభించగలవని ఆశిస్తున్నాము.

అ. శంకరశాస్త్రి

కార్యదర్శి

పరీక్షను మాత్రం ఆంధ్ర ప్రభుత్వం నడుపుతున్నది, అందులో ఉత్తీర్ణులైన విద్యార్థులకు మాత్రమే ప్రభుత్వమూ, సంస్థలూ తమ తమ విద్యాలయాలలో ప్రవేశాన్ని కలిపిస్తున్నవి. ప్రభుత్వ విద్యాలయాలలో ఆంధ్రప్రభుత్వమూ, సంస్థల విద్యాలయాలలో ఆయా సంస్థలూ పరీక్ష నడిపిస్తున్నవి. ప్రమాణపత్రాలు ట్రైనింగు సర్టిఫికెట్లు ఇస్తున్నవి. ఇది ప్రభుత్వనియమం సలహా సమితి సలహా. ఆ తర్వాత ప్రభుత్వం 6, 7 తరగతుల్లో హిందీని తీసివేసింది. దానితో ఉపాధ్యాయుల సంఖ్య తగ్గింది. హిందీ ఉపాధ్యాయుల అవసరం వుండదు గనుక హిందీ ట్రైనింగు విద్యాయాలు అవసరం లేదనీ, సంస్థలు విద్యాలయాలు నడిపించు కొంటే బాధ్యత వారిదేననీ ఆ ప్రభుత్వం ప్రకటించింది. 6,7 తరగతులో హిందీ లేకపోవడం వలన ఉపాధ్యాయుల అవసరం తగ్గిపోయింది. అయినా ప్రజలలో హిందీ అభిమానం మాత్రం తగ్గలేదు. ఆ ప్రభుత్వం మారిన తర్వాత కాంగ్రెస్ ప్రభుత్వం తిరిగి 6, 7 తరగతుల్లో హిందీని ప్రవేశపెట్టింది. సహజంగానే ఉపాధ్యాయుల అవసరం పెరిగింది. అందుకు పూర్వంలాగానే ట్రైనింగు విద్యాలయాలు గూడా నడుపుకొన వచ్చునని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రశిక్షణ విద్యాలయాలు తిరిగి ప్రారంభమైనవి. ప్రవేశ పరీక్షను ఆంధ్రప్రభుత్వం వెనకటిలాగానే నిర్వహిస్తున్నది. మంచిదే. కాని సంస్థలు నడిపించే విద్యాలయాల సంఖ్యనూ, స్థలాలను గూడా ప్రభుత్వం శాసించడం ప్రారంభించింది. ఈ అధికారం ప్రభుత్వానికి ఎలా ఏర్పడిందో తెలియదు. ఆగిపోయిన విద్యాలయాలను తిరిగి ప్రారంభించవచ్చునని ప్రభుత్వం నిర్ణయించడం ఉచితమే. అంతేగాని స్థలాలను, విద్యాలయాల సంఖ్యను గూడా ప్రభుత్వం నిర్ణయించడం సమంజసం గాదు. ఈ నిర్ణయం వలన విద్యాలయాల నిర్వహణలో అనిశ్చిత వాతావరణం ఏర్పడి వున్నది. ప్రభుత్వం విపరీతంగా జాప్యం చేస్తున్నది. సంస్థలు ప్రభుత్వం నుండి ఆర్థిక సహాయం కోరడం లేదు. విద్యాలయాల సంఖ్యతో ప్రభుత్వానికి సంబంధంలేదు. సంస్థలు నడిపించే విద్యాలయాల స్థలాలనూ, సంఖ్యను గూడా ప్రభుత్వం శాసించబూనుకొనడం సమంజసంగా లేదు. అంతేగాక ఇప్పుడున్న స్థితి కాను కాను వికృతరూపం దాల్చి హిందీ ప్రచార ఉద్యమాభివృద్ధికి అంతరాయం కలిగించేటట్లుగా కన్పిస్తున్నది. విద్యాలయాల సక్రమణ నిర్వహణ అవసరమే. అందుకు సంస్థలు కృషి జేస్తూనే వున్నవి. ఏదైనా లోటు ఏర్పడితే సరిచేసుకొన వచ్చును. హిందీ సంస్థలూ ప్రభుత్వమూ కలిసి ఆలోచించి ఈ పరిస్థితిని సరి చేయడం అవసరం హిందీ సలహా సమితి పునర్నిర్మాణం జరవడం న్యాయం అది జరిగితే హిందీ అభివృద్ధికి ఎక్కువ సహాయం లభిస్తుంది. చాలా సమస్యలు పరిష్కారం కాగలవు.

# సాహిత్యవీథి

## మేఘ సందేశము – ఆధ్యాత్మిక దృష్టి

— డా॥ తలముడిపి బాలసుబ్బయ్య

ఏకఏవద్విధా భూత్వా ద్విధాచ బహుధా పునః।
తద్బహుత్వం విమృష్టంచేత్ ఏకఏ వావశిష్యతే॥

అనేది భారతీయ వేదాంత విచారసారం. ఒకే బ్రహ్మపదార్థం జీవబ్రహ్మలై, అంతఃకరణాది అనంత భేదాలను పొందిభిన్నత్వాన్ని సంతరించుకున్నది. ఇందలి భిన్నత్వాన్ని విమర్శించి గ్రహిస్తే ఏకత్వమే మిగులుతుంద అనేది అందలి తాత్పర్యం.

ఆదిశంకరులు అద్వైత ప్రక్రియలో, మాండూక్యభాష్య ఆద్యంతాది శ్లోకాల్లో ఈ అంశాన్ని అద్భుతంగా చర్చా పూర్వకంగా వివరించారు.

ఏకః సచ్చిత్సుఖాత్మా గళిత గుణగణో
నిర్వికారః పరాత్మా
మిథ్యామాయాద్యుపాధిర్భజతి బహువిధానీశ
జీవాదిభేదాన్।
తత్త్వజ్ఞాన ప్రకాశాత్ శ్రుతిమతి జనిత
ధ్యానయోగాద్వినాశే
మాయాయాః తత్ప్రయుక్తం నిఖిల మపిజగ
చ్ఛిద్యతే తత్త్వద్రష్టుః

సత్తామాత్ర వస్తువు ఒక్కటే. అది పరిచ్ఛేద శూన్యము. జ్ఞానమయము. సుఖైక స్వరూపము. గుణోపసర్జనంతో వికారరహితం అయినది పరమాత్మ ఈ నిర్గుణ తత్త్వం సగుణ రూపాన్ని పొందింది. ద్విధాభూత్వా అంటే ఇదే అర్థం. సగుణానికి దేహోపాధి అత్యంతావశ్యకమైనది. దానివల్ల కలిగిన అంతఃకరణాది అనంత వృత్తుల విజృంభణే బహుత్వకారణం. ఇది ఏకత్వంలో భిన్నత్వం. వస్తుతత్త్వాన్ని గ్రహించగల్గిన వాక్య విచారానుభవాలవల్ల మాయాకల్పితమైన భిన్నత్వం నశిస్తే మళ్ళీ ఏకత్వమే మిగులుతుంది. ఇది భిన్నత్వంలో ఏకత్వం. భారతీయ వేదాంత ప్రతిపాదితమైన సర్వోత్కృష్ట సత్యం ఇదే.

'ప్రజ్ఞానాంశుప్రతానైః స్థిరచర నికరవ్యాపిభిర్వ్యాప్యవిశ్వం' అనీ, 'యోవిశ్వాత్మా విధిజ విషయాన్ ప్రాశ్యభోగాన్‌స్థవిష్ఠాన్' లాంటి శ్లోకాల్లో శంకరులు చక్కగా విడమర్చారు. ఈ అంశాన్ని.

9–3–34, మోహినీ పురా, సిద్ధిపేట–502 103.

మరి ఇంతటి అగాధమైన తాత్త్విక భావధారకూ, మేఘసందేశానికి పొంతన ఎలా సాధ్యమౌతుంది అనే ప్రశ్న ఇక్కడ తప్పక కలుగుతుంది.

పేరులేని, ఏమాత్రమూ గుర్తింపుకు నోచని ఒక యక్షుడు (కశ్చిత్ యక్షః) భార్యా లౌల్యంతో తన ఉద్యోగ నిర్వహణలో నేరం చేసి తన యజమాని కోపానికి గురై ఉద్యోగంనుండి తొలగింపబడి శిక్ష అనుభవిస్తున్నవాడు. ఆమె వియోగ దుఃఖాన్ని భరించలేక తన క్షేమాన్ని ఏదో లాగ భార్యకు తెలుపాలనే తపనలో, కనపడిన మేఘమనే జడపదార్థాన్ని యాచించిన ఒక ఉన్మత్త ప్రేలాపన మేఘసందేశంలోని ప్రధానాంశం. దీనికీ, పరతత్త్వవేదనకూ సంబంధం ఎలా?

అద్భుతమైన కాళిదాసుని శబ్దార్థసంయోజనా సామర్థ్యం, వర్ణన వైశారద్యం, విషయ నిర్వహణలే మేఘసందేశ ఔత్కృష్ట్యానికి ఆధారంగా నిలిచాయన్నది నిర్వివాదం. అయినా ఆ మహాకవి తాత్త్విక భావధార అనే జీవం ఈ కావ్యోపాధి ఉనికికి మూలమైందన్న విషయమూ నిర్వివాదమే. కావ్య సౌందర్యం అందరికీ బైటికి కనబడుతుంది. తెలియగలిగితే అందలి తాత్త్విక సంస్కారం ఆలోచనకు అనుభవం ఔతుంది.

కాళిదాసు గొప్ప అద్వైతి. వాగర్థరూపులైన (జగత్తు బ్రహ్మలు) పార్వతీ పరమేశ్వరులను 'పితరౌ' అనే ఏక పదగతంగా అద్వైతంగా దర్శించిన మహామనీషి. శ్యామలాదండకం, లఘు చర్చాఘట అంబా సకల జనన్యాదిస్తవ పంచకం, చిద్గగన చంద్రిక అనే శాక్తాద్వైతగ్రంథం మొదలైన ఆధ్యాత్మిక సాహిత్యాన్ని పుష్కలంగానే వెలయించిన ధీశాలి. ఆయన లౌకికసాహిత్య కవికుల గురుత్వమే ఆయన ఆధ్యాత్మికతను మరుగు పరిచింది.

## మేఘసందేశం— తాత్త్వికత

మేఘసందేశ కావ్యంలో కాళిదాస మహాకవి ఐచ్ఛికంగా, విచిత్రంగా 'ఏకక్రియాద్వ్యర్థ కరీ బభూవ' అన్నట్లుగా జగత్తు, ఈశ్వరుడు అనే భౌతిక తాత్త్వికాంశాలను ఏకత్రగ్రథించాడు. పడుగు పేకల పోగులను వస్త్రంగా నిర్మించే ధర్మాన్ని ఇక్కడ కాళిదాసు అద్భుతంగా నిర్వహించాడు.

మేఘసందేశంలో కథానిర్వహణను కేవలం రెండు సర్గలలోనే కాళిదాసు నిర్వహించాడు. వీటికి పూర్వ, ఉత్తర మేఘాలని ప్రసిద్ధి.

పూర్వమేఘంలో నిజకాంతా వియోగియైన యక్షుడు మేఘంతో తన ప్రియురాలికి సందేశం పంపదలచి, ప్రార్థించి, తను నివాసమైన అలకా నగరానికి మార్గనిర్దేశం చేయడం విషయం. ఉత్తర మేఘంలో అలకానగరవర్ణన, తనయింటి చిరునామా, కాంతాసందేశాలు విషయం. ఇదంతా భౌతిక విషయం.

ఇక తాత్త్వికంగా పరతత్త్వ సాధనా మార్గనిర్దేశానికి పూర్వమేఘమూ, పరతత్త్వ వేదనామయమైన స్వరూపస్థితికి ఉత్తర మేఘమూ ప్రతీకలు.

మేఘసందేశంలో అటు కథాపరంగాగానీ, ఇటు తాత్త్వికంగా గానీ మూడే పాత్రలు లేక అంశాలు ప్రధానమైనవి. అవి యక్షుడు మేఘము, అలకాపట్టణము. తాత్త్వికంగా ఈ మూడూ అతి ప్రధానమైన మౌలికాంశాలకు ప్రతీకలు. ఈ మూడింటిలో యక్షుడు, మేఘము ప్రత్యక్ష,

ప్రాతలు. అలకాపట్టణం పరోక్షపాత్ర. మేఘునికి యక్షుడు 'యత్ర, యస్మిన్' అంటూ పరోక్షమైన అలకా నగరాన్ని బ్రహ్మపదార్థాన్ని అపరోక్షం చేసుకున్నట్లుగా అనుభవానికి అందేటట్లుగా వర్ణించాడు.

అలకాపట్టణం— మాయోపాధి విశిష్టమైన ఈశ్వరునికి ప్రతీక. అంటే రజస్తమోగుణాలను ప్రధానంగా తిరస్కరించిన ఉపసర్జనీకృత శుద్ధ సత్వగుణం మాత్రమే మిగిలిన చైతన్యమే మాయ. దీనితో కూడిన తత్త్వం పరమాత్మ (మాయా శబలః) అని అర్థం. దీన్నే వేదాంతులు తత్ పదార్థం అన్నారు.

యక్షుడు—అంతఃకరణ, దానికి సంబంధించిన సంస్కారంతోకూడి, తనకంటే వేరైన ఉపాధి (దేహాదులు) విశిష్టమై చిత్ ప్రతిబింబప్రాయమైన జీవాత్మకు ప్రతీక. వేదాంతులు దీన్నే 'త్వం' పదార్థం అన్నారు.

అయితే వాస్తవంగా ఒక్క ఉపాధి విషయంలో తప్ప ఈ జీవబ్రహ్మలకు భేదం లేదు. (జీవ బ్రహ్మణయో రౌపాధికో భేద) అనే విషయాన్ని అనుభవంలో సాధించాలి. ఆ అనుభవానికి ఆధార ప్రాయమైన పాంచభౌతిక స్థూలదేహానికి ప్రతీక మేఘం. స్థూలదేహం ఉంటేగాని జీవివుండదు. జీవునికే వేదన. ఉపాధి తొలగితేగాని స్వరూపస్థితి లేదు. ఇదో విచిత్రాంశం.

ఉపాధి ఉంటేగాని తెలుసుకునే అవకాశం ఉండదు. ఉపాధి పోతే గాని స్వరూపస్థితి లేదు ఇది ఉంటేగాని అది లేదు, ఇది ఉండికూడా అదిలేదు అనేవైరుధ్యం ఈ విషయంలో కొట్టవచ్చినట్లు కనవడుతుంది. ఈ విధమైన జీవేశ్వరుల అభిన్నతను స్థాపించే సాధనానుభవాలకు మూలమైన 'అసి' అనే వాక్యానుసంధానమే ఇక్కడ మేఘము

మేఘ సందేశ కావ్య వ్యాజంగా తన అపార భావనా బలంతో భారతీయ తాత్త్విక చింతనకు మూలకందాలైన వేదోపనిషత్సార భూతమై, సర్వోత్కృష్టమైన 'తత్త్వమసి' అనే మహావాక్య విచార ధారను కాళిదాసు వివరించినాడనే భావన బలంగా కలుగుతున్నది.

మేఘసందేశం విప్రలంభశృంగార కావ్యం. విప్రలంభం అంటే వియోగం. వియోగం పొందటం అంటే ఒక విషయాన్ని వదులుకొని దానికి దూరం కావడం. దీనికి మూలం త్యాగం. సాధారణంగా మనకక్కరలేని వస్తువు విషయంలో మనకు వ్యామోహం లేకపోవడం అంటే అభావ వైరాగ్యం కొంత వరకు సాధ్యం కావచ్చునేమో కానీ ఏదైనా విషయం (సుఖం) ఎదురుగా అందుబాటులో ఉన్నప్పుడు దాన్ని వదులుకోవడం అంటే భావ వైరాగ్యం చాలా కష్టం. పర్ణాశనులైన విశ్వామిత్ర పరాశరాదులు కూడా లౌక్యానికి దూరంకాలేక పోయారు, అందువల్ల భావవైరాగ్యం అతిప్రయత్నసాధ్యం దీనికి ఫలత్యాగం (మా ఫలేషు కదాచన) జీవం. దీనికి —

యథామృత స్తథా జీవన్ యథాఽసతితథాసతి
యస్యేహ బుద్ధి లోకస్స్యాత్ పరితప్యేత కేన సః॥

అంటూ ఆదికవి వాల్మీకి రాచబాటను ఏర్పరచాడు జీవిస్తూ కూడా మృతునిలాగా నిర్వికార స్థితిని పొంది లేని విషయంలో లాగా ఉన్నదాన్ని కూడా లేనట్లు చూడగలిగే బుద్ధిని పొందిన మానవుణ్ని బాధించేదే ఉండదని దీని సారాంశం.

అలాగే ఇక్కడ మేఘసందేశంలో విప్రలంభ శృంగారానికి—సాంసారిక వైరాగ్యం అని అర్థం. నిత్యానిత్యవస్తువివేకంతో ఇహాముత్రఫలభోగ వైరాగ్యస్థితిని సాధకుడు సాధన చేస్తున్నాడని తాత్పర్యం. ఈ సాధనలో సాధకుడు ఫల వ్యామోహాన్ని వీడలేక సాధన భంగాన్ని పొంది స్వాధికారం నుండి భ్రష్టుడయ్యాడు. అందుకని పునస్సాధన కొనసాగించాలి. ఆ సాధననే మేఘ సందేశం.

ఇక్కడో రహస్యంకూడా ఉంది. సమష్టిమైన స్వపారమార్థికసత్తనుండి విడివడి దేహిగా మారిన వ్యష్టిజీవతత్త్వం ఆ ఎడబాటుకు తల్లడిల్లి స్వరూప స్థితిని మళ్ళీ పొందడానికై (జీవుడు) పొందే వేదనే ఇక్కడి యక్షుని ఆ వేదన.

కశ్చిత్కాంతా విరహ గురుణా స్వాధి
కారాత్ప్రమత్తః
శాపే నా స్తంగమిత మహిమా వర్ష
భర్తుః ।
యక్షశ్చక్రే జనక తనయాస్నాన పుణ్యోద
కేషు
స్నిగ్ధచ్ఛాయా తరుషవసతిం రామగిర్యాశ్ర
మేషు ॥

అంటూ వస్తునిర్దేశంతోనే కాళిదాసు మేఘ సందేశాన్ని ప్రారంభించాడు. కః అంటే ప్రకృతి సమ్మిశ్రితుడైన జీవుడనీ, చిత్ అంటే కేవల శుద్ధచైతన్యమైన పరమాత్మ అనీ 'కశ్చిత్ శబ్దం తోనే కాళిదాసు జీవబ్రహ్మైక్యాన్ని సాధించాడని పెద్దల విశ్వాసం. 'కశ్చిత్' అనే పదం అవ్యయం. అవ్యయం అంటే నాశం లేనిది.లింగవిభక్తి వచన శూన్యమైన పదం అవ్యయం అని వ్యాకరణ పరిభాష, అంటే సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన శుద్ధ సత్యమని అర్థం. దీనిలో లింగం—విజాతీయ భేదం. విభక్తి—సజాతీయ భేదం. వచనం—స్వగత భేదం

ఇంకో విధంగా కశ్చిత్—ఒకడు. ఇది వ్యష్టి జీవ తత్త్వానికి ప్రతీక. కాంతా విరహగురుణా— అనేదానికి ప్రియురాలు వియోగదుఃఖ ఆధిక్యమని సాధారణార్థం. ఇక్కడ 'కాంతా' అంటే స్త్రీ అనే కాకుండా మరో రహస్యం ఉంది. 'కాంత' శబ్దానికి కస్య—సుఖస్య అంతో—నిశ్చయో అత్రేతి కాంతః అంటే సుఖము యొక్క నిశ్చయస్థితి అని అర్థం. అంటే నిరతిశయానందమైన సమష్టి బ్రహ్మ స్వరూపమని అర్థం. ఈ వ్యష్టి సమష్టులే క్షరాక్షర పురుషులు.

ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర
ఉచ్యతే ॥

అంటూ ఈ అంశాన్ని గీతాచార్యుడు స్పష్టపరచాడు. ఆ సమంతాత్ విరహః— అవిహారః కాంత + అవిరహః కాంతా విరహః తేన గురుణా అనే పదచ్ఛేదం ఇక్కడ చేయాలి. 'కాంతశబ్దానికి పరతత్త్వం అని అర్థం కనుక దాని నుండి విడివడిన జీవతత్త్వాల అవియోగానికి దుఃఖపడిందని అర్థం. కాంత శబ్దం పరబ్రహ్మ బోధకమని విష్ణు సహస్రనామాలూ, భాగవతం ధృవపరుస్తున్నాయి.

స్వాధికారాత ప్రమత్తః— అంటే సాధన చతుష్టయ విశిష్టమైనఅధికారిత్వం నుండి సాధకుడు (జీవుడు) భ్రష్టుడయ్యాడని అర్థం. శాపేనాస్తంగమిత మహిమా అంటే ఐశ్వర్యం. ఈశ్వర భావం, దాన్ని పోగొట్టుకున్నాడు (అణిమాదులు అష్ట విభూతులు). వర్షం సంవత్సరం. నూరా, ఒక్కటా అనే

భేదాన్ని ప్రక్కకు పెడితే వర్షం అంటే (మానవ) జన్మ అని అర్థం. అంటే సాధకుడు సాధన భంగం వల్ల మరో జన్మ ఎత్తాడని తాత్పర్యం. జనక తన యాస్నాన పుణ్యోదకేషు—సీతారాములు ప్రకృతి పురుషులు, వారికి నిత్య సంసర్గం. అంటే ఐక్యం. రామగిరి–రాముడు విగ్రహరూపుడైన ధర్మం. అంటే యతుడు గిరిలాంటి అచంచలమైన నిర్వికల్ప సాధనలో మగ్నుడయ్యాడని అర్థం.

తస్మిన్నద్రే కతి చిదబలా విప్రయుక్తస్యకామీ
నీత్వా మాసాన్ కనక వలయ భ్రంశ రిక్త
ప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమ దివసే మేఘ మాశ్లిష్ట
సానుం
వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ॥

అబలా విప్రయుక్తః— అంటే ఇక్కడ నిజ ముక్తి కాంతా వియోగం పొందిన, సకామీ—మోక్ష మిచ్ఛుః అంటే మోక్షకాంక్షియైన జీవుడు, అతడు కనకవలయ భ్రంశ రిక్త ప్రకోష్ఠుడు—కనతి దీప్యత ఇతి కనకః—ప్రకాశించునది అయిన వలయం అంటే చుట్టూ–అంతటా నిండిన నిజనిరాకార నిర్గుణ చైతన్యం భ్రష్టః— దాని నుండి జారిన, ప్రకృష్యతే ప్రావరణాత్ బహిః నిస్సార్యత ఇతి ప్రకోష్ఠః అంటే ఉపాధిలోకి జారిన జీవుడు అని అర్థం. తస్మిన్నద్రౌ—ఆ నిర్వికల్ప సమాధిలో, కతి చిన్మాసాన్ నీత్వా—అంటే కొన్ని సాధనలను సాధించిన తర్వాత మస్యతే—పరిమీయదే అనేన ఇతి మాసః— అంటే కొలవడానికి అందని కాలాన్ని పరమాత్మను కొలిచే సాధనం. మేఘాన్ని అంటే తనలోని అన్నమయమైన స్థూలదేహాన్ని తెలుసుకున్నాడు సాధకుడు. ఇది ఎప్పుడూ ఆశ్లిష్ట సానువే సనోతి సుఖం దదాతీతి సానుః—నిరతిశయ సుఖాన్నిచ్చే ఆత్మతత్త్వం సుఖైక స్వరూపమైన ఆత్మను అంటిపెట్టుకుని ఉన్న జీవతత్త్వం దాన్ని 'దదర్శ' అంటే అనుభవగోచరం చేసుకునే ప్రయత్నంలో ఉన్నాడని అర్థం. 'శేషాన్ మాసాన్ గమయ' అని తర్వాత చెప్పడం వల్ల ఇప్పుడు గడిపిన మాసాలు—సాధనలు ఎనిమిది. ఇది పతంజలి మహర్షి పేర్కొన్న యమనియమాది అష్టాంగానుష్ఠానానికి ఉపలక్ష్యకం కావచ్చు.

తస్యస్థిత్వా కథమపి పురః కౌతుకాధాన
హేతోః
అంతర్బాష్పశ్చిరమనుచరో రాజరాజస్య
దధ్యౌ।
మేఘాలోకే భవతి సుఖినో స్యన్యథా వృత్తి
చేతః
కంఠాశ్లేష ప్రణయినిజనే కింపునర్దూర సంస్థే॥

తస్యపురః కథమపి స్థిత్వా—ఔపాధికమైన ఆ మేఘదర్శనం అతనిలో కౌతుకాన్ని కలిగించింది. ఈ కౌతుకం ఆందోళన అనీ, ఉత్సాహం అనీ రెండు విధాలు. ఉపాధి ఉంటే స్వరూప స్థితి లేదనే ఆందోళన, ఉపాధి వల్లనే కదా పరతత్త్వం తెలిసేది అనే ఉత్సాహం, ఈ మేఘదర్శనం అతనికి కళ్ళనీళ్ళు తెప్పించింది. ఇవి ఒక విధంగా దుఃఖ బాష్పాలు, మరో విధంగా ఆనంద బాష్పాలు. ఈ అంశాన్నే 'మేఘాలోకే భవతి సుఖినోపి' అంటూ అర్థాపత్తి సహిత అర్థాంతరంలో కాళిదాసు అద్భుతంగా సమర్థించాడు.

ప్రత్యాసన్నే నభసి దయితాజీవితాలంబనార్థీ
జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్
ప్రవృత్తిం॥

సప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతఃప్రీతి ప్రముఖవచనం స్వాగతం వ్యాజహార॥

ప్రత్యాసన్నే నభసి-అంటే శ్రావణమాసం సమీపించింది అని సాధారణార్థం, కాని ఇక్కడ సాధకాని నభస్సు అంటే ఆకాశతత్త్వం, దానిలో లీనం అయ్యే అవకాశం దగ్గర అయిందని అర్థం. మేఘైర్న భాతీతి-నభఃమేఘాలతో అంటే ఉపాధులతో ప్రకాశించని ఆత్మతత్త్వం అని అర్థం. ఈవిషయంలో ధూమేనావ్రియతే వహ్నిః యథా దర్శోమలేనచ॥ అనేది గీతాచార్యుని సమర్థన. దయితా జీవితాలంబ నార్థీ-ముక్తిలోనే శాశ్వతాలంబనాన్ని అర్థించిన సాధకుడు అని అర్థం. జీమూతేన-మేఘంచేత- జీవనం-ఉదకం, మూయతే బధ్యతే అత్రజీమూతః-దీనియందు ఉదకము బంధింపబడును. ఉదకం అంటే నారం-పరమాత్మ స్వరూపం అని అర్థం. పరమాత్మ స్వరూపాన్ని తనలో బంధించిన ఉపాధి మేఘం.దానితో స్వకుశలమయీం ప్రవృత్తిం హారయిష్యన్-ఇక్కడ ప్రవృత్తి అంటే వార్త అని సాధారణార్థం. కాని ప్రవృత్తి అంటే జననమరణ చక్రం. దాన్ని హారయిష్యన్ పోగొట్టుకొన దలచి అని అర్థం. ఇది స్వకుశలమయి. మనకు కుశలాన్ని కలిగించేది. మంచిని కలిగించే దాన్ని వదిలించుకోవడం ఎందుకు? అంటే ఇక్కడో కిటుకుంది. ఇష్టమైనది లభించినందు వల్ల సుఖం, అనిష్టమైనది తొలంగినందు వల్ల సుఖం. ఇక్కడ ప్రవృత్తి అనే భవరోగం తొలగినందువల్ల అది కుశలమయి అయింది. అటువంటి మేఘాన్ని అర్చించి ప్రార్థించాడు యక్షుడు, ప్రవృత్తికి మూలమైన మనస్సు మహా టక్కరిది. దీన్ని మంచి మాటలతో మళ్ళించాల్సిందే కాని శాసిస్తే మాత్రం త్రిప్పికొడుతుంది.

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం।
అభ్యాసేనతు కౌంతేయ! వైరాగ్యేణచగృహ్యతే॥

అంటూ గీతాచార్యుడు మనోనిగ్రహంలోని క్లేశాన్ని స్పష్టంగా చెప్పాడు ఇక్కడ ఒకే విషయాన్ని దేహమనీ, ప్రాణమనీ, మనస్సనీ అవసరాన్ని బట్టి చెప్పడంలో వ్యక్తిభేదమే కాని వస్తుభేదం కాదని గుర్తుపెట్టుకోవాలి.

ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః
సందేశార్థాః క్వపటు కరణైః ప్రాణిభిః ప్రాపణీయాః॥
ఇత్యాత్సుక్యాదపరిగణయన్ గుహ్యకస్తంయయాచే
కామార్తాహి ప్రకృతి కృపణాః చేతనా చేతనేషు॥

మేఘసందేశ కావ్యానికి, కాళిదాసుని తాత్త్విక దృష్టికి మౌలికాధికరణంగా నిలిచింది, ఈ శ్లోకం. అందుకనే కాళిదాసు దీన్ని జాగ్రత్తగా చాలా బలమైన విషయం, అర్థాంతన్యాసం అనే అలంకారాల సంసృష్టితో నిర్వహించవలసి వచ్చింది.

ప్రపంచం పంచభూతాల సమ్మేళనం. అయితే చార్వాకాది దర్శనకారులు ఆకాశతత్త్వాన్ని అంగీకరించలేదు. కారణం ఏమంటే అది నిరాకార నిర్గుణతత్త్వం కావడమే. అంటే అది ఇంద్రియానికి ప్రత్యక్షంగా గోచరించదు. ఆకాశమాత్ర-శబ్దం. మనం శబ్దాలను వినగలుగుతున్నామంటే కార్యం జరిగింది. కానీ కారణం పరోక్షం (కనపడనిది). కారణం లేంది కార్యం జరుగదన్నది వ్యాప్తి. వ్యాప్తి ఉన్నచోట కార్యాన్నిబట్టి కారణాన్ని

అనుమతి 'ఊహ' ద్వారా సాధించాలి. అందువల్లనే శబ్ద మాత్రను బట్టి ఆకాశభూతాన్ని అంగీకరించక తప్పలేదు. తర్కం అనుమితి ద్వారా సాధించిన అంశాన్ని సత్యమై, శాస్త్రీయమైందిగా పేర్కొంది. ప్రమాణాల్లో అనుమానానికే అగ్రతాంబూలం అనేది తత్త్వవేత్తల నిశ్చితాభిప్రాయం. అనుమానం ద్వారా పరోక్షాన్ని భేదించి అనుభవపూర్వకంగా ప్రత్యక్షం చేసుకోవడాన్నే అద్వైత వేదాంతం అపరోక్షానుభూతి అంది. ఈ విధమైన ఆకాశతత్త్వాన్ని మిగిలిన నాలుగు భూతాలనుండి వేరుచేసి 'నభసి' అని ముందుగానే కాళిదాసు చెప్పిందాడు.

పంచకోశాంతరస్థిత విలక్షణమైన ఆత్మ స్వరూపాన్ని గ్రహించడానికి అవసరమైన విశ్లేషణను కాళిదాసు బలంగా ప్రతిపాదించి ఈ శ్లోకంలో నిక్షిప్తం చేశాడు.

అన్నమయమైన స్థూలశరీరాంతర్గత ప్రాణాది కోశాదులకు ఉపలక్షకాలే ఈ ధూమజ్యోతి స్సలిల మరుత్తులు. ధూమం—పృథివీతత్త్వం. ఇది దృష్టి నిరోధకమైనది, గాఢమైనది, క్లేశకారకమైనది. ఇక్కడ కాళిదాసు పృథివీతత్త్వం తర్వాత 'ఆత్మనా ఆకాశస్సంభూతః' అనే శ్రుతివాక్యక్రమానికి భిన్నంగా—సలిల తత్త్వానికి బదులుగా-తేజస్తత్త్వాన్ని చెప్పాడు. ఎందుకిలా జరిగింది? అనే ప్రశ్న వస్తుంది. అగ్ని తత్త్వం—చైతన్యం అంటే ప్రాణం. ప్రాణానికీ స్థూల శరీరానికీ ధూమాగ్నులలాంటి వ్యాప్తి ఉంది. ఇవి అవినాభావమైనవి. అందువల్లనే ఇలా చెప్పవలసివచ్చింది. సలిలం—నీరం అంటే జ్ఞానం. మరుత్తు—సంస్కార జన్యమైన వాసనావృత్తి ఈ నాలుగూ వానికి సమీపంలోని ఆకాశతత్త్వంలో 'ప్రత్యాసన్నే నభసి' లో విలీనం కావాలి.

> ఏషస్వయంజ్యోతి రశేషసాక్షీ
> విజ్ఞానకోశే విలసత్యజస్రం।
> లక్ష్యం విధాయైన మసద్విలక్షణం
> అఖండ వృత్త్యాత్మతయానుభావయ॥ (వివేక
> చూడామణి)

అంటూ శంకరులు ఈ అంశాన్నే సిద్ధాంతీకరించారు.

> ఏషః—స్థూలదేహం—ధూమం
> స్వయంజ్యోతిః—జ్యోతి
> విజ్ఞాన కోశే —సలిలం
> అఖండవృత్తి— మరుత్తు
> అనుభావనం—అకాశం

అనేది పంచభూతాలకూ వాని మాత్రలకూ ఉన్న సంబంధం.

ధూమజ్యోతిస్సలిల మరుత్తులైన జడ పదార్థాలెక్కడ? శుద్ధ జ్ఞానమయమైన సందేశార్థాలు ఎక్కడ? అంటే—సందిశ్యంతే ఇతి సందేశాః చక్కగా చూపే అర్థాలూ, తెలిపే అర్థాలు, అని అర్థం. ఇక్కడ సందేశార్థాః అనేదానికి తెలియబడే ఆత్మతత్త్వం చైతన్యం అని అర్థం. ఇది ఉపదేశాల వల్లగానీ, బుద్ధివల్లగానీ, శాస్త్రజ్ఞానం వల్లగానీ లభించదు. దానికై ఎవరు తీవ్ర తపనలో ఉంటారో వారికి అదే తెలుస్తుంది—

> 'యమేవైష వృణుతే తేన లభ్యః
> తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వాం।'

అని శ్రుతి (ముండక) దృష్టాంతం. ఈ జడ చైతన్యాలకు పొత్తు ఎట్లాగ అన్నదే ఇక్కడి విషమాలంకారపరమార్థం. ఇది అది కాదు అంటే— చైతన్యం జడంకాదు, దీనికి సంబంధించిందే అది చైతన్యంలోందే జడం అనే వైరుధ్యాన్ని కాళిదాసు అద్భుతంగా విషమాలంకారం ద్వారా సాధించాడు.

ఇత్యౌత్సుక్యాత్—ఆత్మతత్త్వంతో తిరిగి కల వాలనే తీవ్రమైన ఇచ్ఛతో—ముముక్షుతతో, గుహ్య కుడు—నిధీన్ గుహంతీతి గుహ్యకాః—నిధులను రక్షించే యక్షులే గుహ్యకులు గుహా—సంవరణే— అంటే షడ్వికార యుక్తమైన కుత్సిత దేహోపాధిని పొందిన జీవుడని అర్థం. అర్థాంతరన్యాసం అంటే అనుషక్తమైన అర్థంతో చెప్పబడేది అంటే ఉన్న జీవతత్వాన్ని పరోక్షమైన ఆత్మతత్త్వంతోనే చెప్పాలి—సమర్థించాలి అని అర్థాంతరన్యాసాలంకార సార్థక్యం.

ఇక్కడో సృష్టి రహస్యం కూడా నిక్షిప్తమై ఉంది. జీవునికి అతి సమీపమైన పూర్వరూపం మేఘం అనేది ఉపనిషత్ప్రతిపాదకమైన సత్యం ఈ విషయాన్ని 'పంచాగ్ని విద్య' అనే పేరుతో చాందోగ్యోపనిషత్తు స్పష్టంగా వివరించింది. పాంచాలరాజుకూ — గౌతమ శ్వేతకేతులకూ జరిగిన సంభాషణలో 'పంచమ్యా మాహుతావాపః పురుషవచసోభవంతి అనే దానికి సమాధానంగా రాజు' పర్జన్యోవావగౌత మాగ్నిః, తస్యవాయుః ఏవసమిత్, అభ్రంధూమో, విద్యుదర్చిః అశనిః అంగారా, హ్రాదునయావిస్ఫు లింగాః' అంటూ మేఘంయొక్క సావయవత చెప్ప బడింది. మేఘము—అగ్ని, వాయువు—సమిధ, ధూమం-కిరణాలు, విద్యుత్ (జ్యోతి)-జ్వాల, పిడుగు-నిప్పుకణము, ఉరుములు—నిప్పురవ్వలు. ఈ అగ్నికి దేవతలు ప్రాకృతిక శక్తులు చంద్ర బిందువును ఆహుతి చేస్తారు. దీనివల్ల వర్షం కురుస్తుంది. జీవోత్పత్తి ఔతుంది, ద్యులోకాగ్ని మేఘాగ్ని. ప్రృథివ్యాగ్ని పురుషాగ్ని స్త్రీరూపాగ్ని అనేవే పంచాగ్నులు. ఇవే జీవోత్పత్తికి మూలం అనేదే పంచాగ్ని విద్య. ఇందులో మేఘాగ్ని దాని అంగాలనే కాళిదాసు ఇక్కడ పరుత్తులు అన్నాడు.

'జాతంవంశే భువన విధితే' అనే శ్లోకంలో యక్షుడు మేఘుణ్ని పొగడి తనకోర్కె తీర్చమని ప్రార్థించాడు.

'సంతప్తానాం త్వమసి శరణం తత్పయోద|
అనే శ్లోకంలో మేఘుడు వెళ్ళవలసింది. కుబేరుని రాజధానియైన అలకానగరమనీ, అది అతనికి తప్పక చేరవలసిన స్థలమనీ చెప్పాడు యక్షుడు. అలకా-అంటే అలయతి—భూషయతి, స్వస్థాన మత్యలకా-తన స్థానాన్ని తానే అలంకరించుకునేది అలక. అంటే దాన్ని అలంకరించగలిగిన మరొకటి లేదని తాత్పర్యం. ఇది అఖండమైన నిరాకార నిర్గుణ పరమాత్మ తత్వానికి ప్రతీక—

> 'నతద్భాసయతే సూర్యః నశశాంకోనపావకః।
> యం ప్రాప్యననివర్తేతే తద్ధామ పరమంమమ॥

అని గీతాచార్యుడు స్థాపించాడు—

> నిరస్తమాయాకృత సర్వభేదం
> నిత్యం ధృవం నిష్కలమప్రమేయం।
> అరూపమవ్యక్త మనాఖ్యమవ్యయం
> జ్యోతిః స్వయంకించిదిదంచకాస్తి।

అని ఆదిశంకరులు వివరించినదీ ఈ అధిష్ఠాన బ్రహ్మమే. ఇది అనుత్తమం. అంటేదీని కంటే మించిన మరొక ఉత్తమమైనది లేనిది 'తమేవ భాంతమను భాతిసర్వం' కఠవల్లి. స్వస్థానాన్ని అలంకరించటం అంటే జీవుడు ఉపాధిని వీడి నిరావరణుడై స్వరూపస్థితిని పొందడం అనికూడా అలకా అనేదానికి అర్థం.

'కర్తుం యచ్ఛ్ప్రభవతి మహీముచ్ఛిలింధ్రా
మవంధ్యాం'

అనే శ్లోకంలో 'ఉచ్ఛిలింధ్రాం'-అంటే సాధకుడు సాధనా వ్యగ్రుడు అయిన తర్వాత క్రమంగా పుట్టగొడుగుల్లాంటి జన్మకారక వాసనలు తొలగుతాయని అర్థం-

'యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ
గ్రంథయః।
అథమర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనం॥

అంటూ కఠోపనిషత్తు ఈ వాసనాగ్రంథులు ఛేదింపబడితేనే అమృతత్త్వం సిద్ధిస్తుందని వాసించింది. అవంధ్య—అంటే వ్యర్థంకాని సాధన.

గర్జితం—అనేది సాధకుని దీక్షా దార్ఢ్యతకు
ప్రతీక
ఆ కైలాసాత్-బ్రహ్మైక్యంతోనే వర్షసమాప్త
మయ్యే నిర్వి

కల్ప. సాధన అని అర్థం. నభసి—అధిష్ఠాన సత్తను చేరడాన్ని గురించిన సాధనలో రాజహంసలు—యోగీశ్వరులు మేఘునివెంట ఉంటారని అర్థం. యోగులమార్గమే సహాయకారి కాగలదని తాత్పర్యం. 'మహాజనో యేనగతః స పంథాః' అనేది పెద్దల అనుభవసారం.

'మార్గం తావచ్ఛృణుత్వత్ప్రయాణానురూపం
మార్గం అంటే పరతత్త్వ సాధన క్రమం అని అర్థం. అ తర్వాతనే సందేశం. ఖిన్నః ఖిన్నః- శిఖరిషు, క్షీణః క్షీణః-స్రోతసాం అని అనడంలో- జ్ఞానంఅంటే సమ్యగవేషణ. చక్కగా పరతత్త్వాన్ని వెదకడం. ఈ ప్రయత్నంలోని సాధనలో మధ్య మధ్యన ఏకాగ్రత దెబ్బతినవచ్చు, పర్వతాలపై విశ్రాంతి, నదీజలాలతో పుష్టిని పొందమని చెప్పడంలో సాధకుడు మళ్ళీ అచలస్థితిని అంటే నిర్వికల్పస్థితిని పొందాలని అర్థం. స్రోతఃపయః అంటే నదీజలం అనేది అఖండంగా ప్రవహించే నిరంతర ధ్యానధారను మళ్ళీ పొందడం అని అర్థం. ఇక్కడ ఖిన్నఃఖిన్నః క్షీణఃక్షీణః, అనే ద్విరుక్తి సాభిప్రాయత ఇదే.

రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పు
రస్తాత్
వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖండమాఖండలస్య
యేన శ్యామం వపురతితరాం కాంతిమాపత్స్య
తేతే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః॥

ఈ ఎదుట ఉండే పుట్టరంధ్రం నుండి పుట్టిన పద్మరాగాది కాంతులు వలజల్లే ఇంద్రధనుస్సు వల్ల నీ దేహం పింఛంతో ప్రకాశించే శ్రీకృష్ణుని శరీరంలాగా ప్రకాశించగలదని దీని బాహ్యార్థం.

...కం—వలంతే దంతే ప్రాణినో అత్ర ల్మీకం. వల సంచరణే, సంవరణే అంటే జంతువులు దీనియందు సంచరించును అని అర్థం. అంటే పుట్ట ఉపాధి సహితుడైన జీవునికి ఉపలక్షకం. అఖండయతీతి—అరిన్ ఛినత్తీతి-అఖండలః అతని ధనువు-ఇంద్రధనువు, అంతశ్శత్రువులైన అరిషడ్వర్గం, అంతఃకరణ వాసనలు అనేవాటిని ఛేదించే సాధననే ఇంద్రధనువని తాత్పర్యం. ప్రభవతి— అంటే సమర్థము అని అర్థం.

ధనువు—ఆత్మసాధన మార్గానికి ప్రతీక. వింటి బద్ద మూడు వంకరలతో ఉంటుంది దీని రెండు కొసలను కలుపుతూ త్రాడుంటుంది. అల్లే

ఆత్మసాధనలో జ్ఞాతృజ్ఞాన జ్ఞేయాలనే త్రిపుటి ఉంటుంది. తెలుసుకునేవాడు— జ్ఞాత తెలియడానికి సాధనం-జ్ఞానం. తెలియదగినది జగత్తు లేక బ్రహ్మము—జ్ఞేయం. ఈ మూటికి ఐక్యం జీవేత్వం అసి—తత్ అనే పదత్రయం, వీని అనుభవమే సాక్షాత్కారం.

ఇక్కడ కాళిదాసు మేఘానికి-కృష్ణునికి, ఉపమేయోపమానాలకు, జీవ బ్రహ్మలకు యత్ శబ్దంతో సంబంధాన్ని చెప్పాడు.

**తే శ్యామం వపుః**— నీ నల్లని—మలిన వాసనలతో ఉన్న శరీరం, గోపవేషుడైన విష్ణువులాగా అధికమైన కాంతిని పొందగలదనడం వల్ల అఖండ తేజస్సులో లీనం కావడం సూచిత మౌతున్నది. కృష్ణుడు కూడా నల్లని వాడేకదా అంటే అది అఖండ మనస్సు. త్రిజగన్మోహన నీల కాంతి 'జ్యోతిశ్చేతసి నశ్చకాస్తి జగతా మేకాభి రామాద్భుతం' అన్నాడు లీలా శుకుడు.

ధనుఃఖండం—అనడంలో సాధన మార్గ మధ్యంలో ఉందని అర్థం.

మేఘుని ప్రయాణం ఆమ్రకూటం (చిత్రకూటం) నుండి ప్రారంభమౌతుంది. ఇక్కడ కాళిదాసు భారతదేశ భౌగోళిక స్వరూపాన్ని అద్భుతంగా దర్శింపజేశాడు.

మార్గంలో నర్మదా (రేవా)నది, దశార్ణదేశం, దానిరాజధాని విదిశ, అక్కడి వేత్రవతీనది, నీచైర్గిరిలను చెప్పాడు. తన పుట్టిన దేశమైన ఉజ్జయినిని కీర్తించడానికై అక్కడ నుండి మార్గం వంకర అయినా, ఉత్తరదిశామార్గంలో తూర్పున ఉన్న ఉజ్జయినికి మేఘుణ్ని వెళ్ళమన్నాడు. నిర్వింధ్యానది, అవంతి, శిప్రానదిని చెప్పి, చండీశ్వరుణ్ని, మహాకాళ క్షేత్రంలోని స్వామిని, భవానిని అర్చించి మందాయంతేనఖలు సుహృదామభ్యుపేతార్థ కృత్యాః' అనే చరక తగిలించి ఉత్తరదిశగా సాగమన్నాడు. గంభీరానది, దేవగిరి, అక్కడ కుమారస్వామిని అర్చించి ముందుకుసాగి చర్మణ్వతీనది, బ్రహ్మావర్తనం, కురుక్షేత్రం, సరస్వతీ నది, కనఖలగిరి, గంగానది, హిమగిరి, రుద్రపాదాలు, క్రౌంచరంధ్రాల గుండా సాగి కైలాస గిరిని, చేరమన్నాడు. అక్కడ మానస సరస్సు అవతల అలకానగర దర్శనం చేయించాడు.

ఈ మార్గ నిర్దేశంలో సాధనా విశేషాలుకూడా ఉన్నాయి. హిమగిరిపై తనపైదుముక యత్నించే శరభాలను శిక్షించమని యక్షుడు మేఘుని 'యే సంరంభోత్పతనరభసాః అంటూ ఆదేశించాడు.

ఇక్కడ ముక్తాధ్వానం—అంటే సర్వవాసనలను విడిచేసాధనలో, అష్టపాత్తులైన శరభాలు—అంటే పంచభూతాలు, మనస్సు బుద్ధి, అహంకారం అనే అష్టవిధాలైన మాయలు సాధకుణ్ని అక్రమించే ప్రయత్నం చేస్తాయని అర్థం. వాటి అంగాలు భిన్నమయ్యేటట్లు కరకాలు అంటే వడగళ్ళతో కొట్టమన్నాడు. కరోతి దోషాభావమితి కరకాః దోషశుద్ధి కలిగించే సాధనలలో మాయను భేదించడమని ఇక్కడ తాత్పర్యం. చివరగా కైలాసగిరిపై అలక కనపడుతుంది.

'తస్యోత్సంగే ప్రణయిన ఇవ, అనే శ్లోకంలో కామచారి ఐన మేఘుడు తప్పక అలకను గుర్తిస్తాడన్నాడు.

'నత్వం దృష్ట్వా నపున రలకాం జ్ఞాస్యసే కామచారిన్' అని చెప్పడంలో రెండు వ్యతిరేకార్థకాలున్నాయి. అతడు అలకనుగుర్తించ గలడు

అనడానికి, గుర్తించలేక పోడు అనడానికి భేదం ఉంది ఇది పట్టిగా చూస్తూనే గుర్తింపు కలిగేదికాదు లక్షణాల భావనతో మీమాంస చేసుకుంటేనే అనుభవానికి వచ్చేది. 'తస్మాన్నయగురు వచనైః సాధు మీమాంసనీయం' అని అనుభవవేత్తల భావన ఏదైనా బలమైన అంశాన్ని భారతీయ విచారధార రెండు వ్యతిరేకాలతోనే చెప్తుంది. ఏకం అనేదాన్ని అద్వైతం అనీ, శివం అనేదాన్ని శివేతరక్షతి అనీ, సత్తు అనేదాన్ని అసద్విలక్షణం అనీ, ప్రత్యక్షం అనేదాన్ని అపరోక్షానుభూతి అనీ చెప్పడం సంప్రదాయం.

కామాన్ని— మోక్షాన్ని ఉద్దేశించి ప్రయత్నించి వర్తించేవాడు కామచారి— పునః అలకాం దృష్ట్వా — అంటే ఏ అలకానగరం నుండి— ఏ బ్రహ్మదార్ధంనుండి ఎడబాటు పొందాడో— విడివడ్డాడో పరోక్షమైన దాన్ని తప్పక అపరోక్షం చేసుకోగలడమనే తాత్పర్యం,

ఇది పూర్వమేఘవిషయం. ఇది సాధనమార్గమైతే ఉత్తరమేఘం అలకానగరవర్ణన అంటే బ్రహ్మపదార్థాన్ని లక్షణాలలో తెలియడం అని అర్థం.

ఉత్తరమేఘంలో అలకానగరవర్ణన, యక్షుని ఇంటిగుర్తులు, సందేశాలు ప్రధానాంశం.

ఉత్తర మేఘారంభంలోని 'విద్యుత్వంతం లలిత వనితాః' అనేశ్లోకంలో తులయితుమలంయత్ర తైస్తైర్విశేషైః అంటూమేఘం— అలకాపురాంకూ, ఉపమేయో పమానాలకూ, జీవబ్రహ్మలకూ, లక్షణ సామ్యం చెప్తాడు. 'తత్త్వమసి' అనే మహావాక్య సారం ఇదే.

పంచ భౌతిక దేహయుక్తుడైన జీవుడే, నిరాకార నిర్గుణ బ్రహ్మమని చెప్పడంలో ఇక్కడ వాచ్యార్థానికి బాధ కలిగిందా, ముఖ్యార్థ బాధ కలిగితే లక్షణతో అర్థాన్ని చెప్పాలి. జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ అని లక్షణలు మూడు విధాలు, ఇందులో జీవబ్రహ్మలకు అభేదాన్ని వేదాంతులు జహదజహల్లక్షణతో సాధించారు. 'సో' యం దేవదత్తః అన్నప్పుడు దేశ, కాల, వయోభేదాలను వదలి వ్యక్తిని మాత్రమే అంటే లక్షణార్థాన్ని మాత్రమే గ్రహిస్తాము. అట్లే త్వంపద లక్ష్యార్థమైన ప్రత్యగాత్మకూ, తత్పదలక్ష్యార్థమైన పరమాత్మకూ అభేదమే జీవబ్రహ్మైక్యమని జ్ఞాతల అనుభవం.

'యత్రోన్మత్త భ్రమర ముఖరాః—' అనే శ్లోకంలోని భ్రమర—తుమ్మెద అనేది ఒకచోట ఉండకుండా అంతటా తిరిగేది—అంటే దేశపరిచ్ఛిన్నమైనది అని అర్థం. హంస శ్రేణులు అంటే యోగులు. యోగం అంటే కూడిక-ఐక్యం. శిఖీ నెమలి—అగ్ని. అగ్ని అంటే జ్ఞానం. 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున, అని గీతా వాక్యం, 'జ్ఞానాదేవతుకైవల్యం' అనే ఉపనిషద్వాక్యం. ఈ అంశాన్ని ధృవపరుస్తున్నాయి. ఇందలి నిత్యభాస్వత్కలాపా, నిత్యజ్యోత్స్నః అనే సమాసాలు, అఖండజ్యోతిర్మ వంత, ప్రతిహత తమో వృత్తిరమ్యాః అనేది సర్వోపాధి విర్ముక్తమైన స్వరూపస్థితి అనే లక్షణాలను తెలుపుతున్నాయి.

'ఆనందోత్థం నయనసలిలం'

అనే శ్లోకంలో విత్తేశానాం నళిలు వయోయౌవనాదన్యద ప్తి—అనడంలో వి త్త— అం దే వేతృత్వం— జ్ఞానమయ త అం దు లో

ఈశ్వరులు అంటే జ్ఞానకైవల్యం. వయోభేదం లేదనడంలో బ్రహ్మకు అవస్థాభేదం లేదనేది లక్షణం 'ఆనందోత్థం' అనడంలో నిత్యానందస్థితిలక్షణం.

'ఏభిః సాధో! హృదయనిహితైర్లక్షణైర్లక్షయేథాః

అనే శ్లోకంలో యక్షుడు మేఘుణ్ని సాధు అని సంబోధించాడు. సాధు అనే దానికి నిపుణుడు అని అర్థం ఉన్నా దానికి వ్యవహార ప్రాచుర్యం లేదు. సాధువు అనే దానికి సాధకుడు, సన్యాసి అనే అర్థాలకే రూఢి ఉంది. అందువల్ల ఇక్కడ 'ఓసాధకుడా! హృదయ నిహిత లక్షణాల చేత లక్షించు—తెలిసికొమ్ము' అని అర్థం. హృదయనిహితైః—హృదయ పద్మ మధ్యగత లక్షణాలలో లక్ష్యైక్యం పొందడమని తాత్పర్యం హృత్పుండరీకే పురమధ్యసగ్స్థం

అని శ్రుతివాక్యం.
ఇట్లా చెప్తూ చివరగా—
'ఇష్టాన్ దేశాన్ జలద! విచర ప్రావృషా సం
మాభూదేవంక్షణమపి చ తే విద్యుతా విప్రయోగః

అంటూ కాళిదాసు గ్రంథ పరిసమాప్తి గావించాడు.

ఇష్టాన్ దేశాన్ విచర—అంటే అత్యంత సుఖాస్పదమైన కైవల్యస్థితి పొందమని అర్థం. ముందటి లాగా అనికి స్వాధికార ప్రమత్తత లేకుండా' తేవిద్యుత్—తన అఖండ చైతన్యంలో, క్షణమపి విప్రయోగః మాభూత్—అంటే పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మపదస్థితి కలుగుగాక అనే ఆకాంక్ష ఆశీస్సుతో కాళిదాసు తన కావ్యాన్ని ముగించాడు. ఇక్కడ కూడా 'విప్రయోగః మాభూత్' అని రెండు వ్యతిరేక పదాల సమర్థన ఉంది.

ఇది మేఘసందేశ తాత్త్వికత.

ఎంతగా లౌకిక కావ్యాన్ని చెప్పినాడనే భావన కల్గించినా వేదోపనిషత్ప్రతిపాదకమైన ఆధ్యాత్మిక సంప్రదాయ సంపదకు వారసుడు, వాహిక అయిన కాళిదాస మహాకవి సారస్వతుడై అంతర్వాహినిగా ఆధ్యాత్మికసరస్వతిని ప్రవహింపజేశాడు.

ఎక్కడ చేయి పెట్టినా అనంతనిధులు లభించేది ఈ భారతీయ సనాతన సంప్రదాయ మేరుశైలం. పదానతనఖాగ్రఘాత్ నిర్వ్యన్నిధాన మైన ఇచ్చోట అని గుండెనిండుగా స్వర్గఖండాన్ని కీర్తించాడు ఆమనిత కవిసార్వభౌముడు విశ్వనాథ.

ఆ మహనీయులకు జోహార్లు

# తిక్కన ధర్మాద్వైతము

రావినూతల శ్రీలత

విరాట పర్వం మొదట్లో తిక్కన వ్యాసుని ఇట్లా స్తుతించాడు.

'విద్వత్సంస్తవనీయ భవ్య కవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమి ప్రకర సంభావ్యానుభావుండు గృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహిత నిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్'
(విరాట 1 3)

శాంతి పర్వములో వ్యాసునిట్లు వర్ణించాడు.

'విద్వన్మోదవిధాయి నిర్మలవచో విస్ఫూర్తి విఖ్యాతుఁ గృ
ష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభుఁ నారాయణుంగా విప
శ్చిద్వంద్యం బగు భారతాధ్యయనముం జేయంగ శక్తుండు ధ
ర్మాద్వైతుండు సరోజలోచనుఁడ కన్యుండు తద్వ్యాఖ్యుఁడే.

బహువిధ ధర్మంబులు లో
కహితంబుగ నిట్లు సెప్పఁగా నిర్మలతా
మహనీయధిషణుఁడగున
మ్మహాత్మున కతీరుఁ గురు సమాజవ
రేణ్యా.
(భార. శాంతి V|, 476, 477)

తిక్కన దృష్టిలో వ్యాసుడు ధర్మాద్వైతుడు. ఆయన భారతాన్ని ధర్మాద్వైత స్థితిగ రచించాడు. అవును. వ్యాసుడు ధర్మాద్వైతుడు కాబట్టి ఆయన భారతము ధర్మాద్వైతస్థితిని బొందినది. 'యాదృ శ్రీకారః చిత్రకారః తాదృశాకారః తస్య చిత్రమ్'

ధర్మాద్వైతుడంటే ధర్మస్వరూపుడని అర్థము. నన్నయ వ్యాసుని ధర్మశరీరి అన్నాడు. (అరణ్య)' ఏషవిగ్రహవాన్ ధర్మః అన్న వాల్మీకి ప్రయోగము వంటివే ఇవి.

ఇక ధర్మాద్వైతమంటే ఏమిటి? ముందుగా పండితుల వ్యాఖ్యానాలను పరిశీలిద్దాము.

ఆంధ్ర సాహిత్య చరిత్రకు ఆదిగురువనదగిన పింగళి లక్ష్మీకాంతంగారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వానికి తాము వ్రాసిన తిక్కన వ్యాసంలో ఇట్లా రాశారు. 'సంస్కృత భారతమును తెనిగించుటకు పూర్వము ఆయన యెన్నోమారులు మననము చేసి ఆమ్మహాకావ్యము ధర్మాద్వైతత మూర్తియని దాని

311, లక్ష్మీ అపార్ట్‌మెంట్స్ నల్గొండ చౌరస్తా, మలక్‌పేట, హైదరాబాదు–500 033.

సారమును లోకమునకు తానే ప్రకటించెను. దానికా బిరుదమునిచ్చిన వాడాయనే. భిన్నభిన్నములుగా కన్పించు భారతీయ ధర్మముల కన్నిటికి ఈ గ్రంథము అద్వైత భావమును సాధించె... ఈ భావమునే తమ ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఇట్లు వివరించిరి. "ధర్మ ప్రతిపాదనమున పెక్కు తత్వములు వికీర్ణములై సమన్వయము కుదరని వైవిధ్యము కలవిగా గోచరించుచుండును. అ ధర్మ తత్వములో వైవిధ్యముగాని అనేకత్వముగాని లేదనియు నాకా ధర్మములయొక్క అద్వైతమూర్తి భారతమనియు దర్శించి తద్ధర్మానుగుణముగ భారతమును తెనుగున వినిర్మించెను..."

"ధర్మేచ అర్థేచ కామేచమోక్షేచ పురుషర్షభ, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తినకుత్రచిత్" అని వైశంపాయనుడన్నాడు. అయితే వారివారి అభిమతాలను బట్టి నానామూర్తులుగా గోచరించే ఈ భారత సరస్వతి యొక్క నిజరూపమేమిటి అని ప్రశ్నించినచో అది ధర్మాద్వైతమూర్తి అని తిక్కనసోమయాజి చరమ పరమ సిద్ధాంతము చేసెను.

డాక్టర్ నండూరి రామకృష్ణాచార్యులవారు తమ "తిక్కనరచన" అను గ్రంథములో ఈ భావమునే వివరించారు, ఆయన దృష్టిలో ధర్మాద్వైతము తిక్కనగారి సమన్వయ వేదాంతము వ్యాసుడు భారతమును ధర్మాద్వైత స్థితిగారచించెను. వేదములకు అఖిలస్మృతి సాధములను బహుపురాణ వర్గములకు వాదైన చోటులలో భారతమే మూలము ఉదాహరణమునకు సత్యమునకు అహింసకు విరోధ మేర్పడినచో ధర్మము ద్వైతముగా భ్రమగొల్పును. అప్పుడు భూతహితము ప్రమాణమగును. భూతహితముగా పలికిన బొంకును సత్యఫలమిచ్చుననియు తద్భూత భయాస్పదమైన మహాసత్యమును బొంకేననియు భారతము వివరించిన ధర్మసూక్ష్మము.

ఈ భావాన్నే వివరిస్తూ ఆచార్యులవారు గ్రీకు నాటకముల నుదహరించారు. విప్రతిపన్న ధర్మములకు 'అనన్య సామాన్య కరణంబును ధర్మ ప్రకారంబు' తిక్కన గుర్తించాడు. ప్రాచీన గ్రీకు సప్తర్షులలో నొక్కడగు క్లియోబ్యులను గూడ పరస్పర వైరుధ్యం గల ధర్మముల సమన్వయించి జగత్తుకు ధర్మాద్వైతప్రాయమైన (Go|dermean) సువర్ణ సూత్రాన్ని ప్రతిపాదించాడు. సర్వ ధర్మముల మాధ్యస్థమే సువర్ణ సూత్రమని క్లియోబ్యుల సుభాషితం. తిక్కన వ్యక్తిత్వం లో ఏర్పడిన బహుముఖ, పరిణామ వికాసానికి అంతర్వాహినిగా నైక్యము కూర్చి సమన్వయం సల్పుచున్నదీ ధర్మాద్వైతమే మహాభారతమందు గూడ తన జీవిత వేదాంతమే ఫలించుచున్నదని తిక్కన గుర్తించెను. ఆచార్యుల వారు మరొక రహస్యాన్ని గూడ తెల్పిరి. ఈ ధర్మాద్వైత తత్వము సమన్వయ వేదాంతం తెలుగుభూమిలో నుండి ఆంధ్రవాఙ్మయంనుండి వెలువడుటలో ఔచిత్యమున్నది. తెలుగుదేశం భారతదేశమున ఉత్తర దక్షిణాలకు మధ్యనున్నది. కవయిత్రి సరోజినీదేవి అన్నట్లు ఆంధ్రసంస్కృతి భౌగోళ స్థితిని సార్థకమొనరిస్తున్నది. ఔత్తరాహుల ఆవేశం, దాక్షిణాత్యుల ఆలోచన, అటు భావ శబ్ద లత, ఇటుక్రియారత, అటుశక్తి, తెలుగు సీమలో సంగమిస్తున్నవి.

డాక్టర్ దివాకర్ల వేంకటవధాని గారు తిక్కన ధర్మాద్వైతాన్ని గూర్చి ఒక వ్యాసం రాశారు. ధర్మములకు సమానభావం లేక భేదంలేక ప్రాధాన్యం కల్గునట్లుగా వ్యాసుడు భారతాన్ని రచిం

చేనని తిక్కన తలచినట్లు భావింపవచ్చును. జాతి ధర్మములు వర్ణధర్మములు మొదలగునవన్నియు శ్రేయస్సంపాదకములే. ఈ విధముగా ధర్మముల విషయమున భేదమునందే అభేదం గోచరించును. కాని వ్యాసుడు ధర్మప్రధానముగా భారతం రచించె ననుట ఎక్కువ సమంజసంగా ఉండును. సందర్భము వచ్చినప్పుడెల్ల ఆయన ధర్మాన్ని బోధించాడు. సామాన్యదృష్టికి విరుద్ధముగా తోచు ధర్మములకు సామరస్యం అభేదం కన్పించును.

అవధానిగారు, తిక్కన వ్యాసుని అనుసరించినా తిక్కన మతకవితాదులను కూడ పలురంగములలో అద్వైత స్థితిని సాధించాడని చెప్పిరి. ఆనాడు శైవ వైష్ణవుల సంఘర్షణ అధికంగా ఉండేది. తిక్కన ధర్మాద్వైత విధానమున శైవవైష్ణవమత సామరస్య ప్రధానమైన భారతమును రచించి హరిహరనాథునికి అంకితం చేసెను. రెండవది ఆనాడు కవులలో మార్గ దేశిభేదం స్పష్టంగా గోచరించుచుండెను. తిక్కన కవితారంగమున ఆ ద్వైవిధ్యమును తొలగించి సామరస్యం కల్గించుటకై యత్నించెను. అది కూడ అతని ధర్మాద్వైత సంవిధానంలో ఒక భాగమే. దాని వలన తిక్కన మార్గకవులకు దేశికవులకు మిత్రుడయ్యాడు. తిక్కన జీవితంలో కూడ అవధానులవారు ధర్మాద్వైతస్థితిని దర్శించారు. తిక్కన వైదికమార్గ నిష్ఠమగు వర్తనము నుండి లౌకిక కార్యములైన రాజ్యనిర్వహణ, రాయబారం మొదలగునవి నడుపుచునే ఉండెను. ఈ విధముగా తిక్కన ధర్మాద్వైత స్థితి నవలంబించి మహాభారతము నతి సమర్థతతో అనువదించుటయే కాక మత కవితా జీవితాదులగు పలురంగములందు కూడ అట్టి స్థితిని సాధించి పూర్ణజీవితము పుచ్చి ఆంధ్రులకు ఆరాధ్యదైవమైనాడు" అని రాశారు.

డాక్టర్ కేశవరపు రామకోటిశాస్త్రిగారు 'తిక్కన కావ్యశిల్పము' అను సిద్ధాంత గ్రంథములో ధర్మాద్వైతాన్ని గూర్చి చర్చించారు. వ్యాసుడు లోకహిత నిష్ఠంబూని భారతాన్ని రచించాడు. దానికోసం ఇహపర సుఖములందు ఒకదానిలోనే రాగద్వేషాలను బోధింపక ఇహపరముల రెండింటికీ ఉపస్కారమగునట్లుగా ధర్మాన్ని ఐహికాముష్మికముల వ్యాఖ్యానించారు. ఐహికమునకు కర్మమును పారమార్థికమునకు జ్ఞానమును ముఖ్యం. ధర్మశబ్దానికి కర్మయని అద్వైతశబ్దానికి జ్ఞానమని అర్థమునుచెప్పి ధర్మాద్వైతమున లోకహితనిష్ఠను వ్యాసుడు సాధించినట్లు శాస్త్రిగారు సిద్ధాంతమున లోకహితమును వ్యాసుడు సాధించినట్లు సిద్ధాంతీకరించారు. కర్మజ్ఞాన కాండాలను కలిగి ఉండటంతో భారతం లేఖ్యంబైన ఆమ్నాయమైంది అని కూడ వారు భావించారు. కాని అభ్యుదయ నిశ్శ్రేయసములో రెంటికి హేతువు ధర్మమే. అభ్యుదయహేతువైన ప్రవృత్తి మార్గం రెండూ ధర్మం యొక్క రెండు విధములు. కావున ధర్మం అంటె కర్మమని అద్వైతమనగా జ్ఞానమని చెప్పనవసరములేదు కేవలం ధర్మశబ్దమే రెంటిని బోధించును.

ధర్మాద్వైతమంటె సర్వధర్మసమన్వయం అను సిద్ధాంతాన్ని ఇప్పుడు విచారిద్దాం. దేశకాల నిమిత్తంగా ధర్మం భేదిస్తుంటుంది అని శాంతి పర్వంలో ఉంది. కాని విరోధంలేని ధర్మమే ధర్మమని వనపర్వంలో కలదు.

"అవిరోధాత్తుయోధర్మస్సధర్మ సత్యవిక్రమః" కాని ధర్మవిరోధం కల్గినపుడు ఏమి చేయవలెనో వనపర్వములో సమాధానమిట్లా చెప్పబడినది.

విరోధిషు మహీపాల నిశ్చిత్య గురులాఘవమ్
నబాధా విద్యతే యత్ర తద్ధర్మం సముపాచ
రేత్"
(వన 131–12)

ధర్మములయొక్క గురులాఘవాలను నిర్ణయించు టకు ప్రమాణమేమిటి?

"తస్మాత్ కౌంతేయ విదుషా ధర్మాధర్మ
వినిశ్చయే
బుద్ధిమాస్థాయలోకేస్మిన్, వర్తితవ్యం కృతా
'త్మనా'

భారతంలో దీనికి ఒక ఉదాహరణం లభించును.

"త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థేకులం
కులం జనపదస్యార్థే ఆత్మార్థే పృథ్వీమ్ త్యజేత్"

ఇట్లు ధర్మవిరోధం వాటిల్లినపుడు మన బుద్ధిని అనుసరించి గురులాఘవమును నిర్ణయించు కొని లఘువును వీడి గురువును గ్రహింపవలెను ఇది ఎంత క్లిష్టతరమో సత్యఅహింసలవంటి తుల్యా గౌరవములైన ధర్మములకు విరోధం వచ్చినపుడు తెలియును. 'నాస్తి సత్యాత్ పరోధర్మః' అని శాంతి పర్వం. 'అహింసా పరమోధర్మః' అని అనుశాసనికం. ఇక వీటి మధ్య విరోధం వచ్చి నపుడు భూతహితమే ప్రమాణమని శాంతిపర్వంలో చెప్పబడినది.

'సతస్యవచనం శ్రేయః సత్యాదపి హితం
వదేత్
యద్భూతహితమత్యంతం ఏతత్ సత్యహితం
మమ'

అట్లే అనుశాసనికపర్వమున సత్యమునకు కొన్ని అపవాదములు చెప్పబడినవి.

'ననర్మయుక్తం వచనం హినస్తి
నస్త్రీషురాజన్॥ నవివాహకాలే
ప్రాణాత్యయే సర్వ ధనాపహారే
పంచానృతా న్యాహు ర పాతకాని"
(అనుశాసనిక–18)

కాని వీటినన్నింటిని పూర్వపక్షం చేయుచున్నట్లు అనుశాసనికంలో ఇట్లా చెప్పబడినది.

'ఆత్మహేతోః పరార్థేవా నర్మహా స్యాశ్ర
యాత్తథా
యేమృషాన వదన్తి హతేనరా స్వర్గగామినః

అసలు తిక్కన కేవల ధర్మాద్వైతః శబ్దాన్ని ఎక్కడా ప్రయోగించలేదు ఆయన చెప్పినది ధర్మాద్వైత స్థితిని భారతము కావించెనని అనగా ధర్మానికి అద్వైతమైన స్థితిని భారతం కల్పించినదన్నమాట. ధర్మాద్వైతస్థితి అనగా ధర్మం ఒక్కటే రెండవదిలేదు అని తాత్పర్యం దీనిని ముందు ముందు వివరింతుము.

ధర్మాద్వైతస్థితి అనగా నెట్టిది? అద్వైతమనగా శంకరుడు బోధించిన మతమని ముఖ్యార్థం. కాని సాటిలేనిది రెండవదిలేనిది అను అర్థంలో సామాన్య ప్రయోగములు కల్పించుచున్నవి. సీతావియోగంలో రామునికి ఎక్కడ చూసినా సీతే కన్పింపగా 'కోన్యయమద్వైత భావః అని ఒక కవి వివరించాడు అద్వైతం సుఖదుఃఖయోః......' అని భవభూతి సుప్రసిద్ధ శ్లోకముండనే ఉన్నది. కావున ధర్మాద్వైత స్థితి అన్నప్పుడు ధర్మమునకు అనన్యమైన స్థానం అని చెప్పవలెను.

ధర్మమనగానేమి? జైమిని చోదనా లక్షణో అర్థః ధర్మః' అని సూత్రించాడు. శంకరుడు 'యతః అభ్యుదయ నిశ్శ్రేయసహేతుః సధర్మః' అని నిర్వచించాడు.

ఇక భారతం,

"ధారణాద్ధర్మం ఇత్యాహుర్ధర్మోధారయతే ప్రజాః
యత్స్యాద్ధారణ సంయుక్తం సధర్మ ఇతి నిశ్చయః"
(కర్ణ-69-59)

అని చెప్పును. ఋగ్వేదంలో ఋతం అను శబ్దముచే వాచ్యమైన విశ్వవ్యవస్థయే (Cosmicorder) ధర్మశబ్దానికి వాచ్యమని పెద్దలు చెప్పుదురు. భారతంలో పైచెప్పిన నిర్వచనం ఆ భావమునకు సన్నిహితంగా ఉన్నది.

ఇప్పుడు భారతంలో ధర్మానికి అద్వైతస్థితి ఎట్లా కల్పించబడినదో గమనింపవలెను. అప్పటికే స్థిరపడిన చతుర్విధ పురుషార్థభావం భారతంలో సమగ్ర నిరూపణ మందినది. వ్యాసులవారే.

'ధర్మేచ అర్థేచ కామేచ మోక్షేచ పురుషర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తిన నకుత్రచిత్'
(అను 62-53)

అనిరి. తిక్కన ఇంకొక మెట్టుకు పోయి

"వేదములకు నఖిలస్మృతి వాదములకు
బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా, మూదం ధర్మార్థకామ
మోక్షస్థితికిన్'
(విరాట 14).

అనెను, పురుషార్థములు నాల్గింటిలో మొదటి మూడింటికి త్రివర్గమని ప్రత్యేక పరిగణన కలదు. మోక్షం పారమార్థికం కాగా త్రివర్గం ఐహికమైనది. త్రివర్గములలో నిజముగా అర్థకామము లను రెండే మానవుడు కోరునది. కాని భారతం ఆ అర్థకామములను కూడ ధర్మపూర్వకంగానే సంపాదించవలెనని చెప్పినది. 'కావున ధర్మము ముఖ్యముగ అర్థము కామము నల్పుటొ ప్పగున్" అని అనుశాసనము (V 30). శల్యపర్వంలో శ్రీకృష్ణుడంటాడు.

ధర్మార్థకామంబు లొకటి కొకటి నాశమొందింపకుండంగ నడపవలయు, గాకధర్మంబు సెన నర్థకామములను గోరు పురుషుండు నిందకుఁ గుదురు కాడ (ద్వితీయ-302); కావున త్రివర్గములలో ధర్మం ప్రధాన మనుట సిద్ధాంతం.

త్రివర్గములలో ప్రధానమేది అని భారతమే విమర్శించినది. ఒకనాడు ధర్మరాజు విదురుని, భీమార్జున నకుల సహదేవులను ధర్మార్థ కామ మోక్షములందు ఉత్తమ, మధ్యమ, అధమత్వ నిరూపణం చేయుడని కోరగా దానికి విదురుడిట్లు సమాధానమిచ్చాడు.

'వినుధర్మంబున ధనమగు
ధనమున సిద్ధించు గామ తంత్రం బటుగా
వున మధ్యమంబు న ధమము
ధనకామ ములుత్తమంబు ధర్మంబధిపా',

అర్జునుడు అర్థమే ప్రధానమన్నాడు. నకుల సహదేవులును అతనితో అంగీకరించారు. భీముడు కామమును ప్రస్తుతించాడు. మరియు ధర్మార్థకామములలో ఒకదానినే అనుసరించు వా డధముడని రెండింటి పాటించు వాడు మధ్యముడని, మూడింటిని నడుపువా డుత్తముడగు నాయకుడని ధర్మరాజు

తానడిగిన ప్రశ్నకు విదురుని వాక్యము సిద్ధాంతమని పేర్కొన్నాడు. కాని తన అభిప్రాయంలో వర్గ త్రయ సంజాత మనోదుఃఖ భారసహా౦దగుటకంటె మోక్షము ఎద గోరుట మేలు అని చెప్పాడు.

అట్లాగే మోక్షమునకు గూడ ధర్మం ప్రాతిపదికం. 'నావిరతో దుశ్చరితాత్' అని ఉపనిషత్తు మోక్షధర్మములని భారతమే పేర్కొంది. మోక్షమునకు ఏకైక సాధనంగా చెప్పబడిన ఆత్మజ్ఞానం నివృత్తి రూపమైన ధర్మమే.

*'on tne meaning of Mahadharatha'* అను ఉపన్యాస గ్రంథంలో డాక్టర్ సుక్తాంకర్ పండితుడు భారతార్ధాన్ని మూడు దృక్కోణాలనుండి పరిశీలించినాడు, అధిభౌతికం, ధార్మికం, ఆధ్యాత్మికం. అధి భౌతిక దృష్టిలో భారతం కౌరవ పాండవుల యొక్క యుద్ధ వర్ణన, ధార్మిక దృష్టిలో భారత యుద్ధం ధర్మాధర్మముల మధ్య జరిగిన సంఘర్షణ, ఆధ్యాత్మిక దృష్టిలో ఈ సంగ్రామం మానవుని యొక్క ఉత్తమాధమ ప్రవృత్తుల మధ్య జరిగిన సంఘర్షణ. ధార్మిక దృష్టిని వివరిస్తు భారతధర్మం యొక్క సర్వోత్కృష్టతను నిరూపించునని భావించెను. (*the cultural heritage of india vol ii*).

భారతంలో ఒక పక్షానికి ధర్మరాజు ప్రతినిధి కాగ రెండవ పక్షానికి దుర్యోధనుడు ప్రతినిధి. అందు ధర్మరాజు 'ధర్మోజయతి' అని 'యతో ధర్మః తతోజయః' అని నమ్మినవాడు. అంతేకాక 'ధర్మం చరామి సుశ్రోణినతు ధర్మఫల గౌరవాత్' అని ఆయన పట్టుదల. ఎట్టి సంకట పరిస్థితులలోను ధర్మాన్ని ఆయన వీడలేదు. ఇక ప్రతినాయకుడైన దుర్యోధనుడు జనామి ధర్మం నచ మే ప్రవృత్తిః, జానామ్యధర్మం నచ మే నివృత్తిః' అన్నవాడు.

ధర్మఫలాన్ని కోరనేమోగాని ధర్మము నెప్పుడూ కోరలేదు.

''ధర్మస్యఫలమిచ్ఛంతి ధర్మం నేచ్ఛంతి మానవాః'' అతని అధర్మమే అతని నాశనానికి కారణమైనది.

భారతానికి సూత్రధారుడై నడిపినవాడు శ్రీకృష్ణపరమాత్మ. ఆయనను ధర్మపరిశోధకుడుగా తిక్కన పేర్కొన్నాడు. అధర్మానికి అభ్యుత్థానం కల్గినపుడు తానవతరించి సాధువులను రక్షించి అసాధువులను శిక్షించి ధర్మస్థాపనచేయుదునని చెప్పుకున్నాడు.

''యదాయదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మ ధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్''
''పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే''

శ్రీకృష్ణుడు రాయబారంలో ఇట్లా చెప్పినాడు,

''సారపు ధర్మమున్ విమల సత్యముఁబాపము చేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడబాఱినదైన యవస్థ దక్షులె
వ్వార లుపేక్షసేసి రది వారల చేటగుఁగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవముండెడున్
(ఉద్యోగ||l·273)

అట్టి దక్షులైన ధృతరాష్ట్రాదులు సత్యధర్మముల నుపేక్ష చేయగా శ్రీకృష్ణుడు సారథియై జయం చేకూర్చాడు.

శ్రీకృష్ణుని తర్వాత ఈ సందర్భంలో పేర్కొనదగిన వాడు భీష్ముడు. శాంతి పర్వంలో భీష్ముడు ధర్మరాజునకు సర్వధర్మముల నుపదేశించాడు. అందులో సర్వోత్తమమగు ధర్మ మేదని ధర్మరాజు ప్రశ్నింపగా భీష్ముడిట్లా చెప్పాడు.

'విను మనేక విధంబుల విస్తరిల్లు
ధర్మముల యందొకండును దలఁప నిష్ఫ
లంబు లే దాత్మ మోక్షావలంబియైన
ధర్మ ముత్తమ మండ్రు తత్త్వజ్ఞులధిప'
(శాంతి ౪, **53**)

మరియు

''అరయఁగ ధర్మ తంత్రముల యందు
నిరర్థకము లేదొకండునె
వ్వరిమదియందు ప్రాలెఁదగ వారలు దానిన
పూని ఆచరింతురు''
(శాంతి ౪, **545**)

అని చెప్పెను.

తర్వాత చెప్పుకోదగినవాడు విదురుడు. అతడు ధృతరాష్ట్రునకు సమయము వచ్చినప్పుడల్లా ధర్మబోధ చేయుచునేయున్నాడు. విదురనీతి అని ప్రసిద్ధిగాంచిన భారతభాగం అనేక ధర్మములకు నెలవు.

సకల పుణ్యకర్మచయమును నొకదెస
వినుము పాడిదప్పకునికియొక్క
దిక్కు దీని శ్రుతులు తెలిపెడునెడ వాడి
కలిమి యెందుఁ బెద్దగా నుతించె
పాడిగలిగిన యిహలోక ఫలములెల్లఁ
జేయుటయు కాదు కీర్తియుఁ బెంపుఁ బరుమ
ధరణి బొగడిత యెందాఁక బరుగునంత
కాలమున బుణ్యలోకంబుగల్గునండ్రు''
(ఉద్యో ॥ **60, 67**)

అని పలురీతుల ధర్మాన్ని ప్రస్తుతించాడు

భారతమునకు ముక్తాయింపు భారతసావిత్రి. రెండు చేతులెత్తి ఉద్ఘోషించినను నామాట ఎవరును వినుటలేదు. ధర్మం వలన అర్థకామములు కల్గును. ఐనను అట్టి ధర్మాన్ని ఎవ్వరూ సేవించుటలేదు. కామము వలనగాని లోభమువలనగాని భయంవలన గాని ధర్మమును విడువరాదు. దాని వలన జీవితమున అవరోధమేర్పడినను సరే అని వ్యాసుడు ఆక్రోశించినాడు.

''ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష నచకశ్చిచ్ఛృణోతి
మామ్
ధర్మాదర్థశ్చ కామశ్చ సధర్మః కిం న
సేవ్యతే''
''న జాతు కామాన్న భయా న్నలోభాత్
ధర్మం త్యజే జ్జీవిత స్యాపి హేతోః
'ధర్మోనిత్యస్సుఖ దుఃఖేత్వని త్యే
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః

ఈ విధముగ చతుర్విధ పురుషార్థములలోను ధర్మమునకు అద్వితీయ స్థానాన్ని గల్పించి భారతం 'ధర్మశాస్త్రమని' అని నన్నయ చేతను 'ధర్మాద్వైతమూర్తి అని తిక్కన చేతను కీర్తింపబడినది.

# ఆధునిక సాహిత్యంలో స్త్రీ

కొలకలూరి మధుజ్యోతి

ప్రాచీన సాహిత్యంలో దేవుడు, చరిత్ర వివిధ రూపాలలో అవతరించినందు వల్ల స్త్రీ విలాస వస్తువుగా కనిపిస్తుంది. దీనికి భిన్నంగా స్త్రీని చిత్రించిన పరిస్థితి లేదు. ఈ స్థితి చాలా కాలం కొనసాగింది. 19వ శతాబ్దం లో కొంత మార్పు స్పష్టంగా గోచరం కాసాగింది.

సామాజిక స్థితిగతులు అభ్యుదయ జీవితం, సంస్కరణ దృష్టి. సాహిత్యంపై ప్రభావం చూపగా 19వ శతాబ్దం నాటికి ఆంగ్ల విద్యావ్యాప్తి, ఆంగ్లేయ పాలన, పాశ్చాత్య సాహిత్య సంపర్కం, విదేశీ జీవన విధానం తెలుగు సాహిత్యాన్ని ఎంతో ప్రభావితం చేశాయి. పాశ్చాత్య ప్రభావంతో తెలుగు సాహిత్యంలో ప్రవేశించిన ప్రక్రియలు కథానిక నవల. కవిత్వం నాటకం. ఆధునిక కాలంలోకి ప్రాచీన ప్రభావంతో ప్రవేశించి పాశ్చాత్య ప్రభావంతో విభిన్న పోకడలు పోయాయి.

ఆధునిక సాహిత్యంలో స్త్రీని కవిత నాటక కథానిక నవలలో పరిశీలింపవచ్చు, వ్యాసం విమర్శ, సమీక్ష, లాంటివి ఆధునిక ప్రక్రియలే కాని వానిలో స్త్రీని గూర్చి చర్చించే అవకాశం ఉంది కాని చిత్రించే అవకాశం లేదు.

1) కవిత్వం ; ప్రాచీన సాహిత్యమంతా కవిత్వమే. నాటి నేటి కవిత్వాలకు ఉన్న తేడా స్త్రీ చిత్రణలోనే. ప్రాచీన సాహిత్యంలో స్త్రీ భోగ్య వస్తువుగా కనిపిస్తుంది. స్త్రీని శృంగార పరిధిని దాటి చూచిన వారు తక్కువ. స్త్రీ స్వయం వ్యక్తిత్వం కలదిగానో, చైతన్యమున్న ప్రాణిగానో, నోరున్న వ్యక్తిగానో కనిపించదు. సామాన్య స్త్రీ నుంచి అంతఃపుర స్త్రీ వరకు ఇదే స్థితి.

ఆధునిక కవిత్వంలో విభిన్న శాఖలు కనిపిస్తాయి. స్త్రీకి ప్రాధాన్యం ఇచ్చి నిల్చిన శాఖ భావకవిత్వం. భావకవిత్వం వెలార్చిన కవులలో ప్రముఖులు గురజాడ. కృష్ణశాస్త్రి. రాయప్రోలు. నండూరి, శివశంకర, జాషువా వంటి వారు. ఈ కాలంలో స్త్రీ ఆరాధ్య దేవత అయింది. పూజార్హురాలు అయ్యింది. బాహ్యసౌందర్యాన్ని వర్ణించి ఉద్రూతలూపటం తగ్గి, అంతస్సౌందర్యాన్ని సందర్శించి. చిత్రించి ఆహ్లాదపరచటం ఆరంభమయింది. స్త్రీని శాసించే స్థితి పోయి, స్త్రీ కనుసన్నలలో మెలగటం కనిపిస్తుంది. స్త్రీ చీకటిలో మగ్గిపోయే ఆశ్రిత మూర్తిగా కాక, తొలివేకువలా, అడుగిడే చైతన్య మూర్తిగా అనుపించసాగింది. భావ కవిత్వం ప్రాచీన తీరుతెన్నులకు తెర దింపింది. ఆచార సంప్రదాయాల ముసుగులో నుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్న ప్రపంచానికి ద్వారాలు భావ కవిత్వం తెరిచింది. భావకవిత్వం స్త్రీని ఎక్కువ వర్ణించింది.

లెక్చరర్, తెలుగు అధ్యయనశాఖ, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి–517 502.

ఈ చిత్రణం శృంగారం వరకు పరిమితమైంది. అయితే అది అమలినం, వీరు సంయోగ శృంగారాని కంటే వియోగ శృంగారానికే అధిక ప్రాధాన్యమిచ్చారు.

స్త్రీని సమాదరంగా గౌరవించినవాడు గురజాడ. ప్రేమ, జాలి, సానుభూతిని 'లవణరాజు కల' కన్యకలలో కలిగించాడు. ఆంగ్లభాష సాహిత్య ప్రభావం వలన స్త్రీ పట్ల అపురూప భావాలు ఏర్పడ్డాయి. రాయప్రోలు స్త్రీ ఔన్నత్యాన్ని సున్నితత్వాన్ని స్నేహలతలో వర్ణించాడు. చిన్నతనపు స్నేహాన్ని అనురాగంగా అంగీకరించలేని స్త్రీని ''కష్టకమలంలో'' వియోగానందాన్ని 'స్వప్న కుమారంలో' చిత్రించి అత్యుత్తమ ప్రేమతత్వాన్ని నిల్పారు. రాయప్రోలు స్త్రీలు శృంగార దేవతలు కారు వీరిలో శృంగారాతీతమైన ప్రేమ స్నేహం కనిపిస్తాయి. 'తృణకంకణంలో' నిలిపిన అమలిన శృంగారం స్వార్థచింతన లేని నిర్మల ప్రేమకు నిదర్శనం. శి.శంకరశాస్త్రి లాంటి వారు స్త్రీని దేవతగా చూశారు. కృష్ణశాస్త్రి బాపిరాజులు ఊహాసృష్టి ఊర్వశి శశికళలు, ఇరువురిని ప్రియురాళ్ళగా భావించి కవిత్వం అల్లారు. నండూరి ఎంకి జానపద ముగ్ధ. ఎలాంటి ఆడంబరమూ లేని ప్రాణి. అమాయక జీవి ఆరాధనకి ప్రతీక.

నండూరి, శివశంకర, కృష్ణశాస్త్రి, బాపిరాజులు, స్త్రీని ప్రేయసిగా దేవతగా భావించి ఊహాలోకాలలో విహరించే రోజుల్లోనే జాషువా శ్రీశ్రీలు అనాథ భిక్షువర్షీయసీలలో వాస్తవ రూప చిత్రణ చేశారు. జీవన సమరంలో తల్లడిల్లే స్త్రీమూర్తులను వర్ణించారు.

భావకవిత్వం ప్రధానంగా స్త్రీని ప్రేయసి పరిధిలో పరికించింది. అందువల్లనే స్త్రీలోని అనంతతత్వాన్ని గుర్తించలేకపోయింది. ఊహా కాల్పనికత ఎక్కువ కావటంతో స్త్రీ హృదయ తత్వాన్ని సమగ్రంగా సంపూర్ణంగా సందర్శించలేకపోయింది. అభ్యుదయ దిగంబర విప్లవ కవిత్వాలు ఆర్థిక సాంఘిక రాజకీయ రంగాలు మారిన జీవితాన్యత్వానికి కృషి చేసినా, ప్రత్యేకంగా స్త్రీల పట్ల దృష్టి నిలపలేదు. ఆ లోటును నేడు వెలువడుతున్న స్త్రీవాద కవిత్వం కొంత వరకు పూరిస్తూ ఉంది.

జయప్రద, కొండేపూడి నిర్మల, ఘంటసాల నిర్మల, సావిత్రి, హైమావతి వంటి రచయిత్రులు స్త్రీ పురుష సమానత్వాన్ని కాంక్షించటమే కాదు, స్త్రీలు ఎదుర్కొంటున్న అణచివేతను అసమానతను నిరసించారు. దేశ విదేశాలలోని స్త్రీ స్థితికి ప్రతిస్పందించారు. స్త్రీ శారీరక మానసిక లొంగుబాటును ఖండించారు. స్త్రీ స్వాతంత్ర్యాన్ని స్వేచ్ఛను వాక్కై చెప్పారు. వీరు వెలువర్చే కవితా సంపుటాలు— నడిచే గాయాలు, యశోధర, వగపెందుకే, నీలిమేఘాలు—అన్నీ స్త్రీ అస్తిత్వయత్న నిదర్శనాలే తమ స్వంత విషయాలపై తమకు అధికారం అవసరం అన్నారు. స్త్రీని సమర్థురాలిగా స్వయంశక్తి సంపన్నగా క్రాంతి దృక్పథంతో వర్ణించారు. వీరి వ్యక్తీకరణలో మనస్సుకు నాటుకొనే సూటిదనం ఉంది. రచనా ధోరణి ఈ మధ్య కాలంలో అభివృద్ధి చెందుతువుంది.

నాటకం; కవిత్వంలో స్త్రీ ఊహాలోకాల్లో విహరించింది. స్వాప్నిక జగత్తును స్పృశించింది. కాని నాటకంలో స్త్రీ వాస్తవ లోకంలో తిరిగింది. సహజతను ఆపాదించుకొంది. మానవ జీవితానికి కవితా స్త్రీ కంటే సన్నిహితత సంతరించుకొంది. దృశ్య శ్రవ్య నాటక నాటికలు. ప్రదర్శన ప్రసారాలకు వీలుగా నిల్చాయి. ప్రచురణను కోరాయి. ఈ రచనల్లో స్త్రీ వైవిధ్యం సంభాషణల్లోనే కనిపి

స్తుంది. పౌరాణిక చారిత్రక రచనలు చేసినా తమ సమాజానికి అనుగుణంగా రాశారు. కథ ప్రాచీనం. కథనం అర్వాచీనం.

వేదం వేంకటరాయ శాస్త్రి–ప్రతాపరుద్రీయం–రచన చారిత్రకమే అయినా, ఎల్లి పాత్రను ప్రేమైక జీవిగా చిత్రించాడు. నాటకాలలో విప్లవాన్ని ప్రవేశపెట్టిన వాడు గురజాడ. కన్యాశుల్కంలో స్త్రీ పాత్రలు నాటికి నేటికి అత్యుత్తమ స్త్రీ పాత్రలే. వేశ్యా పాత్రకు ఆధిక్యం ఇవ్వటం ఇందులోని ప్రత్యేకత. కందుకూరి నిరసించిన వేశ్యకు గురజాడ ఔన్నత్యం కల్పించారు. వేశ్యా? కదా?! అన్నదాన్ని బట్టి కాక స్త్రీ ఔన్నత్యాన్ని వ్యక్తిత్వం, ద్వారా సాధిస్తుందన్నాడు. స్త్రీని మనిషిగా చూడటం అభ్యుదయం.

చలం కల్పించిన స్త్రీలు నేటి సమాజపు స్త్రీలు ఎలా ఉండాలో తెలిపితే ముద్దుకృష్ణ రచనలు ఒక స్త్రీకి ఇద్దరు పురుషులు అనే వాదంపై సాగుతుంది. విశ్వనాథ స్త్రీ మాత్రం సంప్రదాయపు ఎల్లలు దాటనిది. అవసరం వస్తే భర్తను తీర్చి దిద్దుకొనే సమర్థత కల్గిన స్త్రీ, స్త్రీని ఉన్నతంగా ఉత్తమంగా వర్ణించిన ఘనత రాజమన్నారుది, 'నిష్ఫలం' ఏమి మగవాళ్ళు సమాజాన్ని ప్రశ్నించేవిగా వేశ్య దేవదాసీ పాత్రలను చిత్రించారు.

నేడు వెలువడే చాల నాటకాలలో స్త్రీ పాత్రలు పెళ్ళికి అటూ ఇటుగా నిలుస్తాయి. పెళ్ళిని తాళిని రక్షించుకోవటం, ప్రేమించి పెళ్ళాడటం, ప్రేమ విఫలం, వియోగం వంటివి ఆధారంగా రచనలు వెలువడ్డాయి. ఒకరిని ప్రేమించి వేరొకరిని వివాహం చేసుకోవడం ఉద్యోగినుల కష్టాలు, కట్నం సమస్య వివిధ రకాలుగా, బ్రతక లేక వేశ్యలైన వారు, స్త్రీ పురుష వ్యత్యాసాలు భరించలేని వారు, కుల మతాంతర వివాహాలు విచ్ఛిన్నమైన వారు, ఆత్మహత్యలు చేసుకొనే అభాగినులు వంటి స్త్రీలు అనేకులు కనిపిస్తారు.

నాటకంలో స్త్రీ శృంగార జీవితం ఎక్కువ వర్ణితమైంది. ప్రాచీన కవిత్వంలో నిర్జీవ శిలా కాక సజీవ శిల్పంలా కనిపిస్తుంది. స్త్రీని చుట్టుకొని అనేక సమస్యలు; శృంగార విషయం ప్రధానాంశాలుగా నాటకం చిత్రితమైనది

కవిత్వ స్త్రీ కంటే నాటక స్త్రీ మానవ జీవితానికి దగ్గరగా ఉంది. కవిత్వ స్త్రీ ఆనందానికి ప్రతీక అయితే నాటక స్త్రీ ఆలోచనకు కారణం అయింది. దానిలో స్త్రీ దేవతై సుదూరంగా నిలిస్తే దీనిలో మనిషిలా దగ్గరయింది,

కథానిక నవల: ఈ రెండూ ఆధునిక సృజన ప్రక్రియ. సమాజ జీవితం సాంఘిక చైతన్యం వీటిలో వివరించటానికి ఎంతో అవకాశం ఉంది. స్త్రీని గూర్చి వర్ణన కవిత్వ నాటకాలలో అంతగా సాగదు. కవిత్వ పరిధి చిన్నది. నాటక పరిధి కొంచెం విస్తృతమే అయినా, కథ సన్నివేశం నాటక నియమావళిలో ఒదిగి పాత్ర ఉండాలి కనుక. నాటకంలో సామాజిక పరిస్థితులను తదనుగుణంగా స్త్రీని వర్ణించే వీలులేక పోయింది. ఇలాంటి నియమ నిబంధనలు కథానికల్లో ఉండవు కనుక పాత్ర సృష్టి సులభమే.

అయితే కథానికలో స్త్రీ సమస్యలు ఒకటో రెండో మాత్రమే స్పృశించటానికి వీలవుతుంది. స్త్రీ మనస్సంచారాన్ని సమాజ ప్రభావాన్ని యథాతథంగా వ్యక్తం చేయటానికి కథానిక విస్తృతి అంగీకరించదు. కాని నవల వీటన్నిటి కంటే విభిన్నమైంది. నాటకాది ప్రక్రియల్లో అయా పరిధిలో స్త్రీ బందీ అయింది. అలాంటి అడ్డంకు లేవీ లేకుండా నవలలో విహరించింది. స్త్రీ

సమస్యను అన్ని కోణాల నుండి చూడటానికి, అవగాహన చేసుకోవటానికి వీలవటమే గాక దాని తీవ్రతను లోతును వ్యక్తం చేయటానికి కూడా నవల అవకాశం కల్పించింది.

నరహరి గోపాల కృష్ణమ చెట్టి—శ్రీరంగ రాజ చరిత్ర లో సోనాబాయి అనే లంబాడి స్త్రీ వర్ణన, కందుకూరి 'రాజశేఖర చరిత్రలో స్త్రీ జనోద్ధరణ, స్త్రీ విద్యావశ్యకత, చిలకమర్తి ' రాజ రత్నం లో స్త్రీల అజ్ఞానం, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి—'ఆత్మ బలి'— లో ఎలాంటి సౌఖ్యాలు చవి చూడని వితంతువైన యువతి సమాజానికి భయపడటం, వేంకట పార్వతీశ్వర కవుల 'మాతృ మందిరంలో వేశ్యాలోలుడయిన భర్తను తృణీకరించి స్త్రీ పడే జీవన వేదన, ఉన్నవ లక్ష్మీ నారాయణ 'మాలపల్లిలో ప్రేమించినవాడితో వెళ్ళిపోయిన స్త్రీ నవలంతా శిక్ష అనుభవించినట్లు కనిపించటం వంటివి చూస్తే రచయిత సంస్కరణ ఉద్దేశంతో నవీన దృక్పథంతో పాత్రను సృష్టించటం తెలుస్తుంది. కాని పాత్ర పురోగమనం అపరంతృప్తికరంగా ఉండ టానికి, ఆశించినంత నవీకరణ లేక పోవటానికి కారణం రచయితలో తరతరాలుగా వస్తూ నిల్చి ఉన్న భావ పరంపరే. స్త్రీ పాత్రల ఎన్నికలో పురోగమన దృష్టి ఉంది కాని చిత్రీకరణలో మాత్రం సంప్రదాయకత ఉంది. ఇది సంపూర్ణంగా నూతనత్వ లేని స్థితి, ఇదో సంధి కాలం, కనుకనే నూతన తను గ్రహించినా, ప్రాచీనతను వీడలేక పోవటం రచయితల్లో కనిపిస్తుంది.

ఇలాంటి సమయంలో స్త్రీ జనోద్ధరణకు పూనుకొని సాహిత్య రంగాన్ని కుదిపి వేసినవాడు చలం, 'మైదానం అరుణ శశిరేఖ, బ్రాహ్మణీకం, దైవమిచ్చిన భార్య లాంటి నవలల్లో స్త్రీ పాత్రలు చైతన్య భరితాలు వీరు కొంగు కప్పుకొని తలుపు చాటున నేల చూపులు చూస్తూ నిల్చే స్త్రీలు కారు. వీరు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాంక్షించే వనితలు. చలం స్త్రీ భావ చాలనం వర్ణించటంలో ఎలాంటి సంకోచం పెట్టుకోలేదు. తత్పూర్వంలా ద్వైధీ భావంతో కొట్టుమిట్టాడలేదు. స్త్రీ స్వేచ్ఛను ఆశించి స్త్రీని సంఘానికి కట్టిపడేయలేదు. ముందు తాను ఆ భావదాస్యం నుంచి బయట పడ్డాడు. తర్వాతే తన స్త్రీ పాత్రలను వీటన్నిటికి అతీతంగా నిలిపాడు. కనుకనే చలాన్ని-సంప్రదాయం మంట గలిపినవాడు అన్నారు. చలం వలన నవలా ప్రక్రియలో వచ్చిన భావ విప్లవం ఏ ఇతర ప్రక్రియా సాధించలేదు. స్త్రీ తాను కోరుకున్న జీవితాన్ని పొందటానికి కులమతాలకు అతీతంగా పోరాడింది. సాధించింది. నాటి సమాజం ఈ ధోరణికి కొంత నిరసన చూపినా, కొందరు రచయితలు దీనిని ప్రశ్నించినా, స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల అవసరం సాహిత్యంలో భాగం కావటం మాత్రం చలంతో ఆరంభమైంది.

విశ్వనాథ రచనల్లో స్త్రీలు కొంత చలం స్త్రీలలా కనిపిస్తారు. 'వేయిపడగలు,' 'చెలియలి కట్ట'లో స్త్రీలు లేచిపోయినా తమ జీవితాలను అను భవించారు, ఆనందించారే తప్ప మాలపల్లిలోలా పాడై పోలేదు. సంప్రదాయబద్ధ రచయిత నుంచి వెలువడిన రచనల్లో స్త్రీ పాత్ర సామాజిక చైతన్య రూపంగా నిలవటం విశేషం. గోపీచంద్ రావిశాస్త్రి పాత్రలు స్వేచ్ఛను చవి చూసినా అవి కొంత పరిధిలోనే ఉన్నాయి. లత సృష్టి విశిష్టంగా ఉంది. బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' లోని పాత్రలు కొంత ప్రత్యేకత కలిగి ఉన్నాయి. వాసిరెడ్డి స్త్రీని విభిన్న కోణాలలో ప్రదర్శించింది. రావూరి స్త్రీని ప్రేమైక జీవిగా చిత్రించారు. బీనా

దేవి స్త్రీ తన అస్తిత్వం కోసం పోరాడేదిగా కనిపిస్తుంది.

స్త్రీ అన్ని రంగాలలో పురుషుడితో సమానంగా ఉంది. పురుషుడితో పోటీ పడి ప్రపంచంలో నిలుస్తూ ఉంది. స్త్రీ అన్నింటిలో సమానమయినప్పుడు ఈ తేడా ఎందుకు ? స్త్రీని వంటింటి కుందేలుగా, పిల్లల్ని కనే యంత్రంగా అసూర్యం పశ్యగా చూడటం నిరసిస్తూ, స్త్రీవాద ధోరణి ఈ మధ్య వెల్లువెత్తింది. స్త్రీని తక్కువగా చూడటాన్ని, అణచివేతని, స్త్రీలపై జరిగే అక్రమాలని ఇది నిరసించింది. తర్వాత్వం—స్త్రీని భోగ వస్తువుగా చిత్రించారు. స్త్రీ సమస్యలను వర్ణించారు. స్త్రీ అభ్యున్నతిని కాంక్షించారు అయితే ఈ పరిణామ క్రమంగా కనిపించే చిత్రణ వర్ణన కాంక్ష అన్నీ పురుషులు వ్యక్తం చేసినవన్నీ అరుదుగా స్త్రీలు పూనుకొన్నా, వారు సమకాలీన ప్రవాహానికి తోడుగా నిల్చారే కాని భిన్న కోణాన్ని దర్శించలేదు ప్రదర్శించలేదు. కాని స్త్రీవాద రచనలు చేసిన వారు అధికంగా స్త్రీలే. తమకు కావలసింది, కోరేది, సాధించేది ఏది అన్నది స్త్రీకి తెలిసినంతగా పురుషుడికి తెలియదు. సాధ్యంకాదు. ఆకలి అయిన వ్యక్తికే దాని బాధ తెలుస్తుంది. అలాగే స్త్రీ అణచివేత పురుషాహంకార ఫలితం, స్త్రీ ఆవేదన లోని లోతు రచయిత్రులకే కాని పురుషులకు తెలిసే అవకాశం తక్కువ. వారిది తరతరాల అనుభవం. వీరిది అంచనా పూర్వకమయిన వ్యక్తీకరణ. కనుకనే స్త్రీవాద ధోరణి నేడు సాహిత్య రంగంలోకి వెల్లువలా ప్రవేశించి పరవళ్ళు తొక్కుతూ ఉంది. జయప్రభ వంటివారి కవిత్వం రంగనాయకమ్మ ఓల్గా వంటి వారి నవలలు ఇందుకు నిదర్శనం. ఏది వ్యక్తం చేసే భావం కొంత కాఠిన్యాన్ని వ్యక్తం చేసినా అది నిశితంగా స్పష్టమైన ఖండనతో ఉంటుంది. నవలల్లో నేడు ఈ ధోరణే కాక సమున్నత స్త్రీ రూపం సాక్షాత్కరిస్తుంది. అత్యాధునిక వనితగా, అపారమేధస్సు కలదానిగా, పారిశ్రామిక వేత్తగా, ప్రతీకారానికి ప్రతీకగా, వివిధ వృత్తుల్లో రాణిస్తున్న మహిళగా అనేక రకాలుగా విభిన్న కోణాలలో రూపుదాల్చి నిల్చింది. నేటి రచనల్లో ఎక్కువగా స్త్రీ సమస్యలు కనిపిస్తున్నాయి. స్త్రీ ఉద్యోగం వివాహం అనే రెండంశాలపై రచనలు అనేకానేకం వెలువడుతున్నాయి.

ఆధునిక కాలంలో స్త్రీ ప్రాధాన్యం కనిపిస్తుంది సమాజంలోని సంఘ సంస్కరణ రచనల్లో కనపడటానికి కారకుడు వీరేశలింగం. విధవా పునర్వివాహం, బాల్య వివాహాల నిరసన ఇతని రచనల్లో కనిపిస్తాయి. ఆరంభించింది కందుకూరి అయితే పురోగమన కారకుడు గురజాడ, మలుపు తిప్పింది చలం. కందుకూరి స్త్రీ సమస్యల పట్ల అవగాహనతో చిత్రిస్తే గురజాడ స్త్రీ వ్యక్తిత్వాలను వర్ణించాడు. చలం సంపూర్ణంగా విభిన్నమైన ధోరణిలో నూతన మార్గాలు ఏర్పరిచాడు. రచయిత తనదైన ఆలోచనా రూపంగా స్త్రీని తీర్చిదిద్దటం తగ్గింది. 1950 తర్వాత ఆలోచనా పంథాలో విప్లవం ఆరంభమయింది. స్త్రీని ముందు తక్కువగా చూడటం నుంచి అధికంగా భావించటం వరకు వస్తే నేడు వాస్తవానికి వచ్చింది స్థితి. దేవతగానో చూడటం కాక ఒక మనిషిగా చూడటం ఆరంభమైంది మూర్తిలా కాక. స్త్రీ ధీరగా స్వతంత్రేచ్ఛ కలిగిన దానిని సాధించగలిగిన సబలగా మారింది. నీచత నుంచి సమానత నుంచి సమానతకు పురుషుడి కంటే ఉన్నత స్థాయిని స్త్రీ పాత్ర పొందిన పరిణామాన్ని చూడవచ్చు. ఇది సమాజానికి ప్రతిబింబం. సాహిత్యం సమాజానికి అద్దం పడుతుంది. సాహిత్యాన్ని పరికిస్తే వారు సమాజంలో స్త్రీ పట్ల ఉన్న దృక్పథం, నేటి సమాజంలో స్త్రీకి కావలసిన స్థానం పట్ల అవగాహన క్రమంగా గోచరమవుతాయి.

# కవితావీథి

## రామ బాణము

ఊట్ల కొండయ్య

అటుల విధిచోదితుండగు నమ్మునీంద్రు
డనుచరులతోడ ప్రస్థానమందు సాగె
నటవి నొరసి పారు స్రవంతి తటము మీద
దాని గలగల లడుగుల ధ్వనుల ద్రావ.

కలభములు వెంట రానొక గజము చేరి
నిలిచె వన పార్శ్వ తటముపై, కలగ కారి
ననుజనమ్ము, మునిపతాక హస్త మెత్తె
నిభము వెను కడుగిడి కరమెత్తి మ్రొక్కె.

తల్లిగని శాబములును హస్తములు నెత్తి
కెత్తుకొని వెన్కకు పదము లిడుట గాంచి
వారు ముసి ముసి నవ్వుచు దారి బట్టి
రా మునీశ్వరు నడుగుల నడుగు లిడుచు.

వృక్ష గుల్మములం దుపవిష్ట పక్షి
గణము స్వరమేళనమున స్వాగతము పలుక
కాకములు మీదనెగుర కాకారవముల
నుపవసథ ముఖులైరి వారుత్సవముగ.

ఇనుడును వారలన్ కలసి
  యేగెడు వాడయి మస్తకమ్ము లె
క్కెను, కని దాని తేఘము
  సహింపక యుద్ధమురాగ, నైపక
య్యనిలుడు వీచె, నభ్రము
  భయాన పలాయన మాయె, దాని పై
చ్ఛవి దగు వాత్య యొక్కడి
  ప్రచండముగన్ మినుదాకలేచినన్.

తొడరి వలాహకాళి
  చను తోయధరమ్మును నిర్వరించి, తా
మెదవక చుట్టుమూగి
  రవి నెల్లెడగప్పె, నకాలసంధ్య పై
బడినటు మూగ వెల్గులు
  ప్రపంచము ప్రబ్బె, ప్రయాణికుల్ భయం
పడగ మహో జవమ్మున
  ప్రభంజన మొక్కడు వీచె నంతటన్.

కాటూరి కవితా పీఠము, కుత్బిగూడ, హైదరాబాదు.

బెదరక రవంత మెయిళులు
చెదరక మరుదాహతిన్ ప్రసృణములు నగుచున్
చదలెల్ల బ్రాకె, చీకటు
లౌదవెన్ భువి, పవలె రేయివోలెన్ తోచెన్, 7

దీ
పమ్ముంగనె శిరమెత్తి, భానుడు దేదీ
ప్యమ్మగ మబ్బుల సందుల
క్రమ్మర కనుపట్టె జగతి కాంతిల మరలన్. 8

క్రోశము లీరుదారి తమకున్
వెనుదిక్కున పర్వుచుండ, మౌ
నీశుని కంటె మున్నొకరుడేగి
వచింప, నుపాంతవర్తియౌ
నాశమికాతిథేయమున
కాయతులై యట పల్లె నెల్లవా
రాశుగముల్ వలెన్ వెడలి
రమ్మునికిన్ విజయమ్ము పాడుచున్. 9

శంఖములు తూర్యములు మ్రోగ చదలు కదల
న్నిలను బడువారలను మోకరిలెడు వారి
బాహువులనెత్తి ఋషియు దీవనల నీయ
నదియ్యు దేవలోక సదృశమగుచుతోచె. 10

ముని నను గమించి యేగుదెంచిన జనమ్ము
గురునకున్ మ్రొక్కి సెలవీయ గోర, జాన
పదులు విందలై వచ్చి, పోవచ్చు నెట్టు
లనుచు ధ్వనియింపగన్ నిల్చి రటనె వారు. 11

ప్రమథులతో శివుండు
చను భావన ముట్టి పడంగ, కూడి వ
త్సములు తలిన్ చరించెడి
విధమ్మువ లోకితమైనయట్లు, హం
సము బృందమ్ముం గలసి
మానస పుణ్య సరస్సునీదు దృ
శ్యము కను విందుసేయ
ముని చయ్యన పల్లియ జేరె వారితోన్. 12

కాళులకు వారి బోసి పొగలను తుడియు
చడుగులకు మడుగు లుత్తరీయముల నొత్తి
వందనముల సాష్టాంగ పడిరి స్త్రీ పు
రుషులు నేను నేనని యొక్కరొకర గడచి. 13

ఆ ఋషి యంఘ్రులనందిన మృత్తిక
బిడ్డల మోముల బెట్టు వారు
నమ్మౌని పాద పద్మమ్ముల నిసువుల
నిడి యెత్తికొని ముద్దులిడెడు వారు
నా తపోనిధి పదమంటి పుణ్యము మ్ముల్లె
మూట గట్టితిమని మురియువారు
నా యోగి చరణములందు శిరములుంచి
యినుమడి పంటలూహించువారు
నగుచు నడుగడుగున మ్రొక్కి నచటి వారి
పదపదమ్మున శరణుపదము లెగయ
నమ్మహాత్మ డాశీర్వాదఘోసమండి
తాన నుండయి చావడి నడుగు బెట్టె 14

చావడియగు పర్ణశాలలోనున్నత
పీఠముంచి రట్టి పీట పైన
రత్నకంబళము పరచి ముని కూర్చుండ
బెట్టిరి ప్రజ భక్తి వివశులగుచు. 15

ముత్తయిదు వొకతె ముని కా
ళ్లొత్తుచు తాంబాళ మందు నిరవు గొలిపి, యా
యత్త కలశ జలములతో
మె తన క్షాళించి యద్దె మేని పయటతోన్. 16

ఐదువత్సాంధ్ర మధ్యమున కొండంత త
పస్వి యవ్వారలే ప గిది నుడివి
రవ్వగిదివి బాలు దట్లాచరించె, ని
ల్లాంధ్ర కెంతటి వాడునైన శిశువె
పరిచర్యవట్ల, నీ పలుకు నిక్కము సృష్టి
తొలితల్లి గోలె, నీ తల్లులు నదియె
తలపింప జేసి తా తపసికి కరములు
కడుగ జేయుచు, వార్చుబడగ జేసి
రపుడు పండు ముత్తైదువరా లొకర్తె
బోనపున్ తలియన్ చేలమునను గప్పి
భూ జనని రూపు దాల్చినయోజ వచ్చె
కటకరజనము పదమందగలి వచింప 17

ఆట గుర్రము వంటి కన్యక యొకర్తు
కట్టెదుటనిడగ మునికి ముక్కాలిపీట
వృద్ధురాలు తల్లియ దాన సిద్ధ వరిచి
వండుటాకు చేతులు చేర్చి పలికెనిట్లు. 18

వేళయతిక్రమించెకదె
వేగ భుజింపుము మమ్ము గన్న మా
మాలిమి తండ్రి! నీ యుదర
మందిర మెట్టెటు నిండు నిమ్మను
ష్యాశికి నిండు భుతు లటులట్టులె
యాశటనున్న నీవు భూ
గోళము మందు టాకుల
గోడు పడుంగద నీ వెరుంగవే? 19

అనెదు స్థవిర మొగము మెప్పగను తేరి
పారజూచి మునీశ్వరు డారగించె
భక్ష్యభోజ్య పానీయ చోష్యముల లేహ్య
ముల ఫలముల నించించుంగుళుల బట్టి 20

అందముక కుందనపు బొమ్మ యట్టులున్న
బాల యొక్కతె ప్రాణముప్రతిలినట్లు
చేతి యుదక పాత్రము ముని చేత బెట్ట
త్రావి, కడిగి, తుడిచె నీయ తరుణి యోజి. 21

మునిభుక్త శేషమున్ గ్రా
మ నాయకుడు పంచె నచటి మందికి నమృత
మ్మని, యంతట మంచము పై
ముని విశ్రమజేసి కుడువబోయె జనులతోన్. 22

గలగల త్రుటిలో జానప
దులు మరలిరి చేలములను తుడిచికొనుచు చే
తుల సాలకు, ముని యవ్వా
రలగని శుభమస్తు పోవలయునని లేచెన్. 23

వలవల లాడుచున్ కనుల
బాష్పములూరగ దీనులై జనుల్
వెలవెలబోయి భక్తి ముకుళించిన
కేలులు దింపకున్న వా
రలగని గద్గదమ్మొదవ గ్రామణి,
పొమ్మన వద్దనంగ నెం
తలము మహాత్మ! రావుకద
తక్కువ నోములు నోయ నెక్కువల్ 24

కన్నది లేదు మేము నిను కన్నులు
నిండుగ గుండె నిండుగన్
విన్నదిలేదు నీనుడులు వీనుల
విందుగ మేనునిండ, నీ
కొన్ని క్షణాలె ప్రోచు మము
కోటి యుగాలయి విస్తరించి, నీ
యన్నువ బిడ్డలన్ మరువకయ్యా
మమున్ మతినుంచు మీ యెడన్. 25

అమత్యవ్ మోకరిలెదు నా
తని వెల్లిరు ననుగమించుతరి వారి నచే
తనులం జేయుచు నొకపె
ట్టున క్రమ్మెన్ చిమ్మచీకటులు లోకమ్మున్. 28

అభ్రచమూ సమూహము నింగి పై దాడి
వెడలి నల్దిక్కుల కడలు కొనగ
తళ పంక్తుల తటిల్లతలు వ్యోమ సీమల
ద్దలు గొట్టుచున్ భయదములు గాగ

మిన్ను విరిగి పడుచున్నట్టు ఉరుములు
ఫెళ ఫెళల నొడళ్లు జలదరింప
ముత్యాలవలె తొల్త, ముత్యాల సరముల
వలె నావెనుక జడివాన కురియ

పర్ణశాల జనుల పరివేష్టితుండయి
నిలిచియున్న మౌని కలయ జూచి
మీదె విజయమనెడు స్మితముతో కూర్చుండె
మొగము లెల్ల నిట్టె ఫుల్లమాయె.

# జన్మాంతర సంస్కారం

ధూర్జటి వెంకట బాలాజీ

మేఘాలు కదిలినప్పుడు–
సముద్రం ఘోషిస్తున్నప్పుడు–
మోడు వారిన చెట్లు ఒక్కసారి–
దిక్కు మొహంతో చూచినప్పుడు–
ఎదలో ఎక్కడో తపన–
మేఘాలను వర్షధారలుగా మార్చాలనీ–
ఘోషించే సముద్రాన్ని శాంతింప జేయాలనీ–
మోడువారిన చెట్లను–
హరిత వర్ణంతో చిగురింప జేయాలనీ–
కోయిలలా పాడాలనీ–
హరిణకంలా గెంతాలనీ–
మయూరంలా పించం విప్పాలనీ–
శిల్పిలా శిల్పాన్ని చెక్కాలనీ–
మనసంతా చెప్పలేని మూగ బాధ–
సాధ్యా సాధ్యాలకు అతీతంగా–
ఆలోచనా స్రవంతికి అంచున–
జోరీగ లాగా మనసుకు తొలిచే ప్రతిభావన–
అందమైన
ఆకర్షణీయమైన
నామనోనేత్రాలకు ప్రతిరూపంగా
నాస్పందనకు అపురూపంగా
కరిగి పోవాలనీ
కలలా నిలిచిపోవాలనీ
ప్రతిభదే పై చేయి అయినా
మనిషి మనుగడకు

ప్రతిభ ఒక్కటే గరీయసి కాదు.
సామాన్యుడి నుండి మాన్యుడిదాకా
మట్టి నుండి మాణిక్యందాకా
పాషాణం నుండి అపూర్వ శిల్పందాకా
అజ్ఞానినుండి జ్ఞానిదాకా
పామరుడి నుండి పండితునిదాకా
ఎగిరే పక్షిలోని మెలకువను
ప్రాకే సర్పంలోని నైపుణ్యాన్ని
తెలుసుకోడానికి
తెలియజెప్పడానికి
మనిషి మేధకు అందని
ప్రకృతికి అంతుబట్టని
ఊహకు సాధ్యంకాని
మనిషిలోపల
లోలోపల
చెప్పలేని చెప్పరాని
అంతుబట్టని
ఏదో ఒక చైతన్యం
మనిషికి రూపురేఖలు దిద్దుతూంది
అదే జన్మాంతర సంస్కారం

# రాత్రి-మృత్యువు

ఆంగ్లమూలం
జోసెఫ్ బ్లాంకోవైట్

అనువాదం
ఎస్. మయూరి

ఓ నిగూఢ నిశీధీ!
మొట్టమొదటి మానవుడైన మా పితామహుడు
ఆదమ్
నీపేరు దివ్యవాణి ద్వారా విన్ననాడు
ఈ అందాల విశ్వం, ఈ వినీలాకాశ పందిరి
ఏమౌతాయో నని హడలి పోలేదూ?
అయినా, సన్నటి మంచు పొర తెర తీసి
అస్తమించే బృహత్ దివిటీ కిరణాల్లో
స్నానమాడి
నెలఱేడు తారాగణంతో రానే వచ్చాడు।
అహో! దీనితో సృష్టి
మానవుని దృష్టిలో ఇంకా విశాల మయింది.

ఓ దివాకరుడా!
నీకిరణాల్లో ఇంతటి కటిక చీకటి
దాగుందని ఎవరూహించగలరు?
పురుగూ, పుట్రా, ఆకు, అలమూ మాకు
చూపెట్టి
ఎంచక్కటి లెక్కలేని, నక్షత్రలోకాల్ని
చూడలేని
అంధత్వాన్ని స్తావని ఎవరు పసికట్టగలరు?
అలాగే, భయాందోళనలతో మనం
మృత్యువును తప్పించుకో చూడనేల?
వెలుగుమనల్ని మోసగించ గలిగినపుడు
బతుకును మాత్రం బోల్తా కొట్టించదూ?

ఆంగ్లోప న్యాసకురాలు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, పెద్దపల్లి, కరీంనగరం జిల్లా.

# అమృతోత్సవం

కందుకూరి శ్రీరామచంద్రమూర్తి

ముదమది పొంగి పొంగి నవ
మోహన ముగ్ధవిలాస మాధురీ
గదితకథా విధాన పథ
గామినియై అమృతోత్సవమ్ములో
పదమిడె: నెందు జూచిన
'సెబాసు' వచించు 'వజీరు'లే! ఖుషీ
ఇది తిరునాళ్ల పంటయయి
యెన్నొ 'యినాముల" గాదెకట్టెగా!
భాషాద్వేషము లేదు: లేవు నసలే
ప్రాంతీయ దౌర్భాగ్యపున్
రోషమ్ముల్ 'మతలబ్బు' లుండ
వెదటన్ క్రూరత్వముల్లేవు: హిం
దీసా ప్రాజ్ఞి సహోదరీ సహిత
దీప్తిన్ విశ్వసంసారియై
"ఘోషా' వీడి కనంబడెన్! కనుల
'షోకుల్' దిద్దె చోద్యమ్ముగన్
పరిపుష్యంబగుచున్ 'తుఫాను' వలె
సర్వ వ్యాప్తిన్ లేచి, సుం
దరతాస్ఫూర్తిని అన్ని దిక్కులకు
'ముష్తాబై' ననాడే నిజం
బరయన్ గల్గును సాహితీరసము
లింతింతైన దోషమ్ము లి
స్తిరి చేయబండు: నే 'సిఫారసి' దకే
దీవించు సౌఖ్యాత్రముల్'
'అర్జీ' లవాతు 'కురిసే'
'దర్జా' వాలతను తిండి దండుగ వారున్
'బూర్జువ' భావము పారును
'మార్జిను' లోనేది లేరు ముందునకైనన్
గి'రీ కట్టుచు మూఢభావములకున్
కూలం కషప్రౌఢి 'కం
బారీ' వేయుచు 'గమ్మతుల్' నెఱపుచున్
'పైకమ్ము' నుం బెంచుచున్
దారిద్ర్యమ్మును రూపుమాపుచు ప్ర
శస్తంబైన 'ఫిక్రున్' 'జమీం
దారీ' గా నమృతోత్సవంబమరు
నంతా సేను నావారునై'
ఇయ్యమృతోత్సవంబున నహీన

---

ఇంటి నెం. 7–34, రవీంద్రనగర్, తూరంగి, కాకినాడ–533 016.

గుణాఢ్యులు భద్రభావులున్
దియ్యము నెయ్యమున్ గలిపి నెమ్మి
నగార' ధ్వనింప జేయగా
నొయ్యన జూచి సంతసము నొందుచు
ముక్కిరి బికిరై తిః నీ
వియ్యము తెల్లకాలమును వెల్గుత ।
మంచు వచింతు శ్వేదుకన్"
అలవిరి మొగ్గల సరదాల 'పరదాల'
నడుగిడి నేర్చిన యమృతరసము
తళుకు బెళ్కుల 'జలతారు' మేల్మనుగులో

అమర నేర్చిన మేటి యమృత ఝరము
చలువ వెన్నెల లూరు తలికి కౌగిళ్లలో
మసల నేరిచిన యమ్మధుర రసము
వెలుగు బెళుకుల చుక్కల గుమి నుండి
తళుకు నేరుపులతో దనరు మనసు
నిండు పున్నమిరేల వెన్నెలలలో 'షి
కారు' గొట్టగా నేర్చిన కమ్రరసము
తెలివి డెందాల కెరటాల తెరలు రసము
నచ్చమై యమృతోత్సవ మందు నిండె'

# మందార మాల

## గోపీచంద్ గారి
## 'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా'-పరిశీలన'

రచయితగా ఆయన విధానమే వేరు. ఇతివృత్త విషయంలోకానీ, కథాసంవిధానంలో కానీ పాత్రల పరంగాకానీ సన్నివేశ చిత్రణ విషయంలోకానీ శిల్పనైపుణ్యంలోకానీ ఆయనను ఎవరితోనూ పోల్చడం కుదరదు. ఆయనతో పోల్చడానికి కూడా ఎవరూ కనిపించరు. ఆయనే తాత్త్విక నవలా సామ్రాట్ శ్రీ త్రిపురనేని గోపీచంద్.

తెలుగు నవలాలోకంలో ఆయనొక విలక్షణ రచయిత. విశ్వనాథ, చలం, బాపిరాజు, బుచ్చిబాబుల ఆలోచనలన్నీ ఆయనలో కనిపించినట్లే కనిపిస్తాయి. కానీ తీరా పరిశీలించి చూస్తే అవి వాళ్లెవరి ఆలోచనలతోనూ సరిపోలవు. లోతుగా, స్పష్టంగా విపులంగా సరళంగా కనిపించే ఆయన ఆలోచనలు పాఠక హృదయాల్ని ఎంతమధురంగా మీటుతాయో అంతబలంగా తాకుతాయి. తన భావనాస్రవంతిలో పాఠక హృదయాల్ని ఓలలాడించడం అడుగంటా ముంచడం ఆయనకే చేతనౌతుంది. ఆలోచనల్ని, అనుభూతుల్ని పాఠక హృదయసీమల నిండా సమృద్ధిగా పండించడం ఆయనకే సాధ్యమౌతుంది. ఎందుకంటే తనగురించి తాననుకునే విషయాలను ఇతరుల గురించి తాననుకునే విషయాలను ఎంత సూటిగా వాస్తవానికి దగ్గరగా చెబుతాడో తన గురించి ఇతరులనుకునే విషయాలనూ అంత సూటిగా వాస్తవానికి అంతదగ్గరగా చెబుతాడు. అదే గోపీచంద్‌లోని విశిష్టత.

గోపీచంద్‌గారు తలంపుకు రాగానే వారి ప్రసిద్ధ నవలలైన అసమర్థుని జీవయాత్ర, మెరుపుల మరకలు చప్పున గుర్తుకు వస్తాయి. అభిమానుల విమర్శకుల సమీక్షకుల దృష్టి కూడా ప్రధానంగా వాటి పైనే నిలుస్తుంది. కేంద్ర సాహిత్య అకాడమీ వంటి ఉన్నత సంస్థ బహుమతితోపాటుగా ఆంధ్రదేశంలో పలురకాల విమర్శకులను అందించిన నవల 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'. నవలగా అది ఒక అద్భుత ప్రయోగమని చెప్పాలి. తన గురించి ఇతరులేమనుకుంటున్నారో అన్న ఆలోచన ప్రతీ వ్యక్తిలోనూ కలుగుతూ ఉంటుంది. అలా కలుగడంలో వ్యక్తికీ వ్యక్తికీ తేడాలున్నప్పటికీ కలుగడం మాత్రం సహజమేననడంలో సందేహం లేదు. ఆ ఆలోచన అటు రచయిత పరంగా ఇటు

పాత్ర పరంగా సాధించి చూపించారు గోపీచంద్ సమాజాన్ని సమాజంలోని వివిధ రకాల వ్యక్తుల స్వభావాల్ని అందలి కుళ్ళునూ ఆలోచనా దౌర్భాగ్యాన్ని కడిగి వేయాలన్న తలంపు రచయితలో అడుగడుగునా కనిపిస్తుంది. నవలను చదవడం ద్వారా రచయిత ఎంతలోతుగా తన పరిశీలన సాగిస్తారో ఎంత స్పష్టంగా తన భావాల్ని ఆవిష్కరిస్తారో తెలుసుకోవచ్చు. అలా తెలుసుకోవడాని కొక కర దీపిక నందించడమే ఈ వ్యాసోద్దేశం.

'నేటి మతిమంతుల్లో ఎక్కువ మంది పలయాలు చుట్టుకొని తిరుగుతున్నారు...అతివేగంగా ప్రయాణం చేస్తున్నామన్న సంతోషం వారికి ఉంటే ఉండవచ్చు. కానీ ఎంత వేగంగా తిరిగితే అంతత్వరగా బయలుదేరిన స్థలానికి రావడమే గద జరిగేపని'. నవలను పరిచయం చేస్తూ మొదటి పేరాను ఈ విధంగా కూర్చారు రచయిత. ఈ పేరాను చూస్తే నవలపై వచ్చిన విమర్శలనీ రచయిత ముందే ఊహించారేమోననిపిస్తుంది. అదే నిజమైతే ఇతరులు తన పట్ల ప్రతి స్పందించే తీరును అంచనా వేయడంలో గోపీచంద్‌గారి నైపుణ్యానికి ఈ నవల ఒక సాక్ష్యమౌతుం దనేది సుస్పష్టం.కథ విషయానికి వస్తే పరమేశ్వరశాస్త్రి నిన్నటి తరానికి ప్రతినిధి నేటి తరానికి ప్రతినిధి కేశవమూర్తి.

ఆయనకు వరసకు అల్లుడు. తరాలమధ్య అంతరాలున్నప్పుడు కొద్దిపాటి ఘర్షణ అనివార్యం కాగా పరమేశ్వరశాస్త్రికి కేశవమూర్తికి జరిగే ఘర్షణ కొంచెం తీవ్రంగా కనబడుతుంది. అందుకు కారణాలు రెండు. మొదటిది ఆ ఇరువురి మధ్యన ప్రత్యక్ష సంబంధం లేకపోవడం. దీన్ని ఆసరాగా చేసుకొని సమాజంలోని కుళ్ళు, మూర్ఖత్వాలు సీమంతం వంటి వారి రూపంలో విజృంభించి వారి మధ్యన దూరాన్ని పెంచాయి. రెండవకారణం విషయానికి వస్తే కేశవమూర్తి గురించి సీమంతం లాంటివాళ్ళు చెప్పడానికి ముందే పరమేశ్వరశాస్త్రికి కేశవమూర్తిపైన ఒక విధమైన అభిప్రాయం ఏర్పడిఉంటి. అది కేశవమూర్తి గ్రాంధిక భాషా వాదాన్ని తిరస్కరించడంవల్ల తన ఇష్టానికి వ్యతిరేకంగా తన పెంపుడు కూతురైన సుజాతను పెళ్ళి చేసుకోవడంవల్ల ఏర్పడినట్టిది. పరమేశ్వర శాస్త్రిలో ఉన్న ఈ భావాన్ని కనిపెట్టి సీమంతం మొదలుగాగల వాళ్ళంతా అతనికి కేశవమూర్తిపై ద్వేషాన్ని సులభంగా పెంచగలిగారు.

కేశవమూర్తిని పెళ్ళిచేసుకోవడం ద్వారా గుర్తింపు పొందిన పాత్ర సుజాత. పరమేశ్వరశాస్త్రి కేశవమూర్తి సుజాత ఇవి మూడు నవలలో ప్రధాన పాత్రలు. ప్రధాన ప్రతినాయకుడు సీమంతం. అతని మిత్రులు (వీరంతా కేశవమూర్తికి మిత్రులే) సుభాషిణి, రామమోహనశాస్త్రి, వెంకాయమ్మ, నాసరయ్య, కృష్ణమూర్తి కరటకశాస్త్రివంటి వారంతా లోకంలోని పలురకాల వ్యక్తిత్వాలకు ఉదాహరణలుగా నిలుస్తారు.

కేశవమూర్తి కీర్తి ప్రతిష్టలు పెరుగుతున్న కొద్దీ అతని మిత్రులైన సీమంతం శారద్వతుడు, రాధారమణలు క్రమంగా శత్రువులౌతారు. వీరంతా పరమేశ్వరశాస్త్రికి చేరువై అతనిద్వారా కేశవమూర్తిని దెబ్బతీసే ప్రయత్నం చేశారు. ఈ తరుణంలో కేశవమూర్తికి సినిమా రచయితగా అవకాశం వచ్చి మద్రాసుకు వెళ్ళవలసివస్తుంది. వెళ్ళేముందతడు తన మిత్రులవద్దకు వెళతాడు. ఈ సన్నివేశం నవలలో ముఖ్యమైనట్టి సన్నివేశంగా చెప్పవచ్చు. సీమంతం, శారద్వతుడు రాధారమణలను కేశవమూర్తిని కలిశాడు. అక్కడ జరిగినకథ

—మూలంగా పాఠకుల దృష్టిలో కేశవమూర్తి ఎంత ఎత్తుకు ఎదిగాడో అతని మిత్రులు అంత క్రిందికి జారారు. కేశవమూర్తిపట్ల పాఠకులకు చివరి వరకూ నశించిపోని అవ్యాజమైన అనురాగం కలుగడానికి ఈ ఒక్క సన్నివేశం చాలు. కేశవమూర్తిలో రచయిత అంతర్లీనంగా ఉన్నాడు. కాబట్టి పాఠకుల అనురాగమంతా రచయితకు దక్కుతుందని తేలికగా ఊహించవచ్చు గోపీచంద్ వేసిన తెలివైన ఎత్తుగడగా దీన్ని పేర్కొనవచ్చు.

కేశవమూర్తిని ఇబ్బందిపెట్టిన వ్యక్తులందరి ప్రాముఖ్యత అతడు మద్రాసు వెళ్ళడంతో తాత్కాలికంగా తగ్గుతుంది. సీమంతం పాత్ర మాత్రం ప్రాముఖ్యతను కోల్పోకుండా అలాగే నిలిచి ఉంటుంది. కథలో పటుత్వం కోల్పోకుండా ఉండడానికి అది తప్పనిసరి. సీమంతం కల్పించిన కృత్రిమ తుఫానులో సుజాత చిక్కుకోవడం మూలంగా కేశవమూర్తి కాపురం కష్టాలపాలౌతుంది తనకున్న బలహీనతైన పరస్త్రీ వ్యామోహాన్ని సీమంతం తెలివిగా కేశవమూర్తిలో ఉందని సుజాతను నమ్మించ గలిగాడు. సుభాషిణి పాత్ర ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది. ఆమె సీమంతం బంధువులమ్మాయి కావడం గతంలో సీమంతాన్ని తిరస్కరించడం గమనించదగ్గవి. సీమంతం మాటలు నమ్మిన సుజాత బెంగుళూరు వెళ్ళడం, అక్కడ సుజాతకు ఆశ్రయమిచ్చిన వెంకాయమ్మ చేసిన టెలిగ్రాం ఆధారంగా కేశవమూర్తి అతని మిత్రుడు రామమోహనశాస్త్రి సుభాషిణిలు అక్కడికి చేరుకోవడంతో సీమంతం కుట్ర వెల్లడై కథా నాయకుని విజయం ప్రతినాయకునికి పరాజయం సంభవించాయి. ఈసంఘటనల నేపద్యంలో నవల చివరిదశకు చేరుకుంటుంది. ఈదశలోని ఘట్టాల్లో చెప్పుకోదగినవి రెండు మొదటిది కేశవమూర్తి ఆధ్యాత్మిక చింతనా ఘట్టంకాగా, రెండవది పరమేశ్వరశాస్త్రి వీలునామా ఘట్టం.

## మొదటిఘట్టం

కేశవమూర్తి బృందం పాండిచేరిలో అరవిందాశ్రమానికి బయలుదేరినది మొదలుకొని తిరిగివచ్చే వరకూ జరిగిన విషయాల్ని విశేషాల్ని గోపీచంద్ అద్భుతంగా చిత్రించాడు. ఆ చిత్రణలో సహజత్వం ఉత్తేజం చైతన్యం జాలువారాయి 'మేడమెట్లు ఎక్కి అరవిందుడున్న ప్రదేశానికి దగ్గరగా వెళ్లాడు కేశవమూర్తి ప్రక్కన ఒక గది ఉన్నట్లనిపించింది. అప్రయత్నంగా అటు తిరిగాడు మనిషి సైజులో ఉన్న అరవిందుని యొక్క మదర్ యొక్క చిత్తరువులు పెద్దఫ్రేములో బిగించబడి ఉన్నాయి...అప్పుడు గ్రహించాడు. కేశవమూర్తి అవి చిత్తరువులుకావని అరవింద మదర్ సజీవమూర్తులేనని...మేడదిగి రాగానే నువ్వు అదృష్టవంతుడివి కేశవమూర్తీ అన్నాడు రామమోహన్‌శాస్త్రి...చూపులను నీ పైకి ప్రసరించారు నీవు ధన్యుడవు అన్నాడు'.

## రెండవ ఘట్టం :

శాస్త్రిగారు తనయావదాస్తినీ కేశవమూర్తికి చెందునట్లుగా వ్రాసి అందరినీ ఆశ్చర్యపరచాడు. అతని మనస్తత్వాన్ని పరిశీలిస్తే ఈ చర్య సబబేననిపిస్తుంది క్రమ శిక్షణ నిజాయితీలకు కట్టుబడిన వ్యక్తి కావడం చేత ఏది చేసినా త్రికరణ శుద్ధిగానే చేశాడు, తనకు వంట చేసిపెట్టే సుందరమ్మను ఒక బలహీన క్షణంలో వశపరచుకొని గర్భవతిని చేసినందుకు అతడు జీవితాంతం పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు సుందరమ్మ

పోలిక ఉన్నందుకు సుజాతను పెంచుకున్నాడు. ఇక్కడ అతనిలోని మానవతాదృష్టి కులగోత్రాల అడ్డుగోడల్ని దాటడం కనిపిస్తుంది.

ఎన్నిసార్లు ఓటమి పొందినప్పటికీ, భంగపడ్డప్పటికీ, ఎదురుదెబ్బలు తిన్నప్పటికీ, లోకంలోని మానవ బలహీనతలుగా భావించబడుతున్న ఈర్ష్యాద్వేషాదులు ఇంకా నశించి పోలేదన డానికి గుర్తుగా సీమంతాదుల్ని మార్చురాని అంతరంగాలలో అలాగే వదిలేయడం కనిపిస్తుంది.

'పురుషోత్తముడు' అన్న నవలను కేశవ మూర్తి చెబుతుంటే సుజాత వ్రాయడంతో ప్రారంభమైన పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా కేశవమూర్తి 'సుజాతల జీవితాలతో కొనసాగి వారి కష్టాల్ని కడతేర్చి తిరిగి పురుషోత్తముడు' నవలను కేశవమూర్తి ముగింపు వాక్యాలు చెప్పడంముగుస్తుంది. పురుషోత్తముడు నవలకు కేశవ మూర్తి చెప్పిన ముగింపు వాక్యాలే పరమేశ్వరశాస్త్రి వీలునామాకూ ముగింపు వాక్యాలు. కేశవ మూర్తి రచించిన పురుషోత్తముడు గోపీచంద్ రచించిన పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా రెండూ ఒకటేననీ కేశవమూర్తే పురుషోత్తముడనీ పాఠకులకు అర్ధమై ఒక మధురానుభూతిని కలిగిస్తుంది. చివరగా కేశవమూర్తి లోని గొప్పతనాన్ని గ్రహించిన రమణారెడ్డి బృందం అతని అనుయాయులుగా మారడం కేశవమూర్తి వరంగల్‌లోనే ఉండిపోవాలని నిశ్చయించుకోవడంతో నవల పూర్తవుతుంది.

కథనం విభిన్న శైలిలో సాగడం ఈనవలలో కనిపించే మరో ప్రత్యేకత. ఆయాపాత్రల ప్రాముఖ్యాన్ని బట్టి భిన్న కోణాలనుండి సమస్యల్ని పరిశీలించినప్పుడు కనిపించే విభిన్నాంశాలని వాస్తవికంగా చిత్రించాలన్న తాపత్రయమే ఇందుకు కారణమని చెప్పవచ్చు. కథానాయకుడైన కేశవ మూర్తి పరంగా కథ నడుస్తుంది. అతని భార్య సుజాత కూడా కథను పాఠకులకు చెబుతుంది. ఈ ఇరువురూ అవసరం లేదనిపించినప్పుడు రచయిత ఆపనిని నిర్వర్తిస్తాడు. ఆ సమయంలో అతడు డైరీద్వారా, ఉత్తరాల ద్వారా కూడా కథను నడిపిస్తాడు. కథలో చిన్నపాత్రే అయినా కొన్ని బలమైన సంఘటనలకు మూలమై నిలవడం చేత సుభాషిణికూడా కథను నడిపిస్తుంది. కథనానికి సంబంధించి ఆత్మాశ్రయ పరాశ్రయ పద్ధతులు రెండూ అవలంబించబడ్డాయి. కేశవమూర్తి పరంగా సాగే కథలో గోపీచంద్ ఆలోచనలు కనిపిస్తే సుజాతపరంగా సాగే కథలో పరిస్థితుల్ని ఎదుటి వ్యక్తి కోణంనుండి చూపించే ప్రయత్నం కనిపిస్తుంది. రచయిత పరంగా సాగినకథ పై సందర్భాలకు సమన్వయాన్ని కుదర్చడంతో పాటుగా కథనాన్ని ఆసక్తికరంగా మలచడం లోకంపోకడకు దర్పణం పట్టడం వ్యక్తుల బలహీనతల్ని ఎత్తి చూపించడం వంటి పనుల్ని నిర్వహించింది.

నవలలో విమర్శల్నెదుర్కొన్న విషయాల్లో కేశవమూర్తి పాత్ర చిత్రణ ప్రధానమైనది. మహోన్నతమైన వ్యక్తిగా కొన్నిసార్లు, అమాయకుడుగా, పసిపిల్లవాడి మనస్తత్వమున్న వాడుగా మరి కొన్నిసార్లు ధార్మికుడుగా అజాత శత్రువుగా ఇంకొన్నిసార్లు కేశవమూర్తి కనిపిస్తాడు. ఒకే వ్యక్తి ఇన్ని రకాలుగా కనిపించడం అసంభవమన్న విమర్శ సరియైనదిగానే కనిపిస్తుంది. రచయిత కేశవమూర్తిలో కనిపించడం లోకంలోని వ్యక్తుల బలహీనతల్ని సహజంగా చిత్రించాలని రచయిత తాపత్రయపడడం, కేశవమూర్తి పాత్రను కాస్తంత వాస్తవానికి దూరం చేస్తే చేసి ఉండవచ్చు. ఐతే అది రచయిత గుర్తించని పరిణామం మాత్రంకాదు.

కేశవమూర్తిలోని ఆధ్యాత్మిక ధోరణి ద్వారా తోప ప్రాముఖ్యాన్ని రచయిత తొలగించాడు. అసాధారణ మేధావులు అద్వితీయ పరాక్రమవంతులూ తమ తమ జీవిత చివరి ఘట్టాల్లో ఆధ్యాత్మిక చింతన వైపు మళ్లడం కనిపిస్తున్నదే ఇందుకు మహర్షి అరవిందుడు ఒక్కచక్కని ఉదాహరణ కేశవమూర్తి కూడా అరవిందునివల్ల ప్రభావితుడు కావడం గమనించదగ్గది. ఇక కేశవమూర్తిలో గోపీచంద్ కనిపించడం గురించి చెప్పాలంటే రచయిత తమ అభిప్రాయాల్ని తన కిష్టమైన పాత్రద్వారా వెలిబుచ్చడం అనేకానేక తెలుగు నవలల్లో కనిపిస్తున్నదే కాబట్టి ఇందులో సహజత్వం ఏమీలేదని భావించవచ్చు

తెలుగు నవలాలోకంలో గొప్పనవలలుగా కీర్తిగాంచినవన్నీ విమర్శల వాడి బాణాల్ని ఎదుర్కొన్నట్టివే. కాగా విమర్శలకు తట్టుకొని నిలిచే గుణమే వాటి గొప్పతనానికి రుజువుగా నిలుస్తుంది. వాటి కీర్తి ప్రతిష్ఠలకు మెరుగులు దిద్దుతుంది. పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా అందుకు అతీతమైనది కాదు—

ఎస్. ఎస్. రాజు
సరస్వతి మహల్
కోహెడ–505 473
కరీంనగర్ జిల్లా.

# తెలుగు కవితాపంటలు పండించిన జంటకవులు

అవధాన ప్రక్రియ తెలుగు సాహిత్యానికే పరిమితమైన ఒక అపూర్వమైన ప్రక్రియ. అలాగే జంట కవితా ప్రవచనం ఆంధ్ర సాహిత్యంలో కన్పించే ఒక అపూర్వమైన సంప్రదాయం జంట కవులు చెప్పే కవిత్వంలో—ఒకే పద్యాన్ని ఒకరు మొదటి పాదాన్ని, రెండవవాడు రెండవ పాదాన్ని చెప్పడం జరుగుతుంది. కష్టతరమైన ఈ ప్రక్రియ నిర్వహణకు ఆయా కవుల ఆలోచనా సరళి, కవితాశక్తి సమపాళ్ళలో ఉండాలి.

సాధారణంగా జంటకవులు కలిసి కవిత్వాన్ని చెప్పడానికి ఒకే గురువువద్ద విద్యాభ్యాసం గావించడంగాని, సన్నిహితమైన మైత్రిగాని, సహాధ్యాయులుగాని, సమస్కంధులుగాని, అన్నదమ్ములుగాని, ఆలుమగలుగాని కారణమై ఉంటుంది.

ఒక భావాన్ని కలిగి కవితలను వెలువరించే ఇద్దరు కవులను 'జంటకవులు' అని పిలుస్తారు. ఈ ఇద్దరు కవులు చెప్పే కవిత్వమే జంటకవిత్వం.

ఆంధ్ర సాహిత్యంలో సామాన్యుడి నుంచి మాన్యుని వరకు ఆనందలహరిలో ఓలలాడించిన విశిష్టమైన సాహితీ ప్రక్రియ జంటకవిత్వం. ప్రాచీన సాహిత్యంలో ప్రారంభమై ఆధునిక సాహిత్యంలో విశ్వరూపం దాల్చిన ఒక విశిష్ట ప్రక్రియ జంటకవిత్వం.

సాధారణంగా ఒక కవి స్వతంత్రుడై ఒక కావ్యాన్ని రాయడంగానీ, ఒక పద్యాన్ని పలకడంగానీ చేస్తాడు. కవి తనకు ఇష్టం వచ్చిన రీతిలో ఊహచేసి,దానిని ఆనందభరితంగా ఛందస్సుని ఆధారం చేసుకుని చెబుతాడు. ఇద్దరు కవులు కలిసి ఒక కావ్యాన్ని రాయాలన్నా, ఒక పద్యం పలకాలన్నా అది సామాన్యమైన విషయంకాదు. ఇక్కడ ఒక పద్యంలో మొదటి చరణం ఒకరు, రెండవ చరణం మరొకరు చెప్పడం జరుగుతుంది.

ఒక కవి తాను కవిత చెప్పేటప్పుడు ఉన్న స్వేచ్ఛ జంటకవులు కవిత చెప్పేటప్పుడు ఉండదు. ఇందులో ఒక కవి తన దృక్పథాని కన్న ముందుగా తోటి కవి దృక్పథాన్ని ఒక్క చూపులోనే గ్రహించవలసి ఉంటుంది. తోటి కవి ఊహలకు, కవితా విన్యాసాలకు అనుగుణంగా మలచుకొని వెనువెంటనే కవితాధారలో కలిసిపోవాలి.

ప్రాచీన లాక్షణికులు జంటకవులను గురించి గాని జంట కవిత్వం గురించి గాని నిర్వచించి ఉండలేదు. ఈ జంటకవులు అనే పదానికి సరైన సమానార్థకమైన సంస్కృత పదం కన్పించదు. దీనికి కారణం సంస్కృతంలో ఇది ఒక ప్రత్యేక ప్రక్రియగా అభివద్ధి చెందక పోవడమే.

సంస్కృతంలో కవి యుగళం, కవియమకం కవి యుగ్మం మున్నగు పదాలున్నాయి. ఈపదాల కర్థం ఇద్దరు కవులైనా కావచ్చు. లేదా జంటకవులైనా కావచ్చు. ఇద్దరు కవులు జంటకవులు వేరు. జంటకవులు వేరు. ఇద్దరు కవులు అంటే జంట కవులు కాకపోవచ్చు. సంస్కృత పదసంబంధమైన కవిద్వయానికి ఇరువురు కనులు అని అర్థం. తిరుపతి వేంకటకవులు జంటకవులనుటకు 'కవి ద్వితీయ, అను పదాన్ని, వెంకటేశ్వర కవులు జంట కవులను 'కవిద్వయం'గా, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు జంటకవులను 'జమిలి కవులుగా' వచించారు ఈజంట, జమిలి, దోయి ద్వంద్వం, ద్విత్వం, ద్వయం మొదలైన పదాలన్నీ సమానార్థకాలే. ఇద్దరు కవుల యుగళంలోను, అనుబంధంతోను, ఒక పద్యాన్నిలేక ప్రబంధాన్ని ఏకభావంతో కలిసి రూపొందించాలనే లక్ష్యం వీరిలో ఉండడంవల్ల వీరిని 'జంట కవులు'గా సాహితీ జగతి ప్రశంసించింది.

సమకాలీనత, ఏకమనస్కత అనేవి జంట కవుల ముఖ్య లక్షణాలు జంటకవులు సాధారణంగా ఆశు కవితా విశారదులై ఉంటారు. జంటకవుల పేర్లలో చక్కని పొందిక ఉంటుంది.

14వ శతాబ్దం నుంచి 20వ శతాబ్దం వరకు జంటకవులు వైవిధ్యంతో కూడుకొన్న సాహితీ ప్రక్రియలను వెలువరించారు. ఇవి ప్రధానంగా 4విభాగాలు. ప్రబంధ నిర్మాణం ఆశు కవితా కల్పన, అవధాన నిర్వహణ, ఖండకావ్య రచన. జంటకవులు కొందరు ఆయాప్రక్రియల్లోనే కవితాఖండికలను వెలువరించగా, మరి కొంత మంది జంటకవులు అనేక పద్ధతుల్లో కవిత్వాన్ని రచించారు. పరిమిత సంఖ్యలో గల ఈ కవుల్లో తిరుపతి వేంకటకవులు ముఖ్యులు. వీరి బాటను అనేకానేక మంది జంటకవులు అనుసరించారు.

తెలుగు సాహిత్యంలో అనేక కావ్యాలు రూపొందించి. ఆశుకవితల్లో, అవధానాలు నిర్వహించి, ఖండకావ్యాలను రచించిన జంటకవులు అనేకమంది ఉన్నారు కాచపిట్టల కవులు, నంది ఘంటకవులు, దేవులపల్లి సోదరకవులు, తిరుపతి వేంకటకవులు, వేంకట పార్వతీశ్వర కవులు వేంకట రామకృష్ణకవులు, రామకృష్ణకవులు కొప్పరపు సోదరకవులు, రాజశేఖర వేంకటశేష కవులు, శేషాద్రి రమణకవులు, పింగళి కాటూరి కవులు ప్రముఖులు.

జంటకవులలో మొదట పేర్కొన దగినవారు గోన బుద్ధారెడ్డి కుమారులైన గోన కాచవిభుడు, గోన విట్ఠలరాజులు. వీరు కాచపిట్టల కవులుగా ప్రసిద్ధి గాంచారు. గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణము ద్విపదలో యుద్ధకాండము వరకు రచింపగా కాచ విట్ఠల కవులు ఉత్తరకాండమును రచించారు.

నంధిమల్లయ, ఘంట సింగయ అనే కవు లను నంది ఘంటకవులంటారు పీరు మామా అల్లుళ్ళు. 'ప్రబోధ చంద్రోదయం', 'వరాహ పురాణాలను' వీరు రచించారు. వీరు పరమేశ్వర ఆరాధన తత్పరులు. పరమ శాంత స్వరూపులు. శాంత రస ప్రధానములగు ప్రబంధములను వేరు రచించారు.

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, దేవులపల్లి తమ్మనశాస్త్రిగారలు దేవులపల్లి సోదరులుగా విఖ్యాతి నొందారు. సుబ్బరాయశాస్త్రి 'రావు వంశముక్తావళి' అనుకావ్యాన్ని, మహేంద్రవిజయం' 'మల్హణ స్తవము', 'రామపంచాశత్తు' అను కృతు లను, సుబ్బరాయశాస్త్రిగారు రచించారు. యతిరాజ విజయము', 'సకలేశ్వరశతకము' నయనోల్లాసం' మొదలైన కృతులను తమ్మనశాస్త్రిగారు రచించారు. వీరు ఎవరికివారు విడిగా గ్రంథ రచన చేసినను అవధానము మాత్రం జంటకవులుగా నిర్వహించారు.

దివాకర్ల తిరుపతి శాస్త్రి చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి గార్లను తిరుపతివేంకట కవులు అంటారు. 'ధాతురత్నాకరం' అను చంపూగ్రంథం వీరి మొదటి రచన. 'శృంగార శృంగాటము' వీథిరూపకము వీరి రెండవ రచన. ఇవి రెండు సంస్కృతంలో రచింపబడినాయి. 'దేవీ భా గ వ తం' 'బుద్ధ చ రి తం' కావ్యం 'శుక రంభాసంవాదం'లను సంస్కృతం నుంచి తెలుగులోనికి అనువదించారు. 'శ్రవణానందం' వీరి స్వతంత్ర కావ్యాలలో ప్రధానమైనది. 'పాణి గ్రహీత', 'లక్షణాపరిణయం', ఏలామహాత్మ్యం' వీరి ఇతర రచనలు. వీరు అనేక అవధానాలు నిర్వహించారు.

బాలాంత్రపు వేంకటరావు, ఓలేటి పార్వతీశం గార్లు వేంకట పార్వతీశ్వర కవులుగా ప్రసిద్ధి కెక్కారు. వీరి కావ్యాలలో ప్రసిద్ధమైనది 'ఏకాంత సేవ', వేంకట పార్వతీశ్వర కవులు రచించిన నవలలో 'ఇందిర', 'శకుంతల', 'చందమామ', 'లక్షరూపాయలు', 'మనోరమ', 'మాయావి', 'వంగవిజేత', ప్రసిద్ధమైనవి. 'చిత్రకథా సుధా లహరి' 'శ్రీమద్రామాయణము' వీరి పద్యకృతులు. 'శివపురాణం', 'బ్రహ్మపురాణం' వీరి గద్య కావ్యాలు.

ఓలేటి వేంకట రామశాస్త్రి, వేదుల రామకృష్ణ శాస్త్రిగార్లను వేంకట రామకృష్ణకవులంటారు. వీరు 30 గ్రంథాలను రచించారు. 'విశ్వగుణా దర్శనం', 'ఔచిత్య విచారచర్చ', 'కవి కంఠా భరణం', సువృత్త తిలకం' అను గ్రంథములను వీరు సంస్కృతం నుంచి తెలుగులోనికి అను వదించారు. 'పాణిగృహీతి', 'కౌరవ గౌరవం', 'లవ' వీరి స్వతంత్ర గ్రంథములు. 'ఇందిరాదేవి', 'శకుంతల', 'సుభద్ర' మొదలైనవి వీరి నవలలు.

ఆ కొండి రామమూర్తిశాస్త్రి, నిశ్శంకుల కృష్ణమూర్తిశాస్త్రి గార్లు రామకృష్ణకవులుగా ప్రసిద్ధి చెందారు పీరు జంటగా రచించిన కావ్యం 'దేవి భాగవతం' మాత్రమే.

కొప్పరపు వేంకట సుబ్బరాయకవి, కొప్పరపు వేంకట రమణకవులు కొప్పరపు సోదర కవులుగా తెలుగు సాహిత్యానికి సేవ చేశారు. వీరు కృష్ణ కరుణా ప్రభావము', 'దైవ సంకల్పం', అను కావ్యాలను 'కుశలవ' నాటకాన్ని రచించారు. ఇవి ప్రస్తుతం అలభ్యం. వీరి అనేక అవధానాలు నిర్వ హించారు.

దుర్భాక రాజశేఖర శతావధాని, గడియారం వేంకటశేషశాస్త్రిగార్లు 'రాజశేఖర వేంకటశేషకవు

లుగా రాయలసీమలో వెలసిన కవిరత్నాలు. వీరు నిర్వహించిన అవధాన జైత్రయాత్రను 'అవధాన సార' అను పేరుతో గ్రంథంగా వెలువరించారు. వీరు విడివిడిగా గ్రంథ రచన చేసినను అవధానములుజంటగా నిర్వహించారు.

దూపాటి శేషాచార్యులుగార్ల సోదరులు. వీరు శేషాద్రి రమణ కవులుగా విఖ్యాతి నొందారు. ఈ జంటకవులు 'అర్జున పరాభవం', అను నాటకాన్ని, 'పాపాలాయ నిర్మాణము', 'వసుంధర', 'ఆంధ్ర మంత్రులు' అను గ్రంథములను రచించారు. శేషాచార్యులు మరణానంతరం వేంకట రమణాచార్యులుగారు రచించినన పద్యకావ్యాలన్నింటికి 'శేషాద్రి రమణకవులు' పేరు మీదనే రచనలు చేయడం జరిగింది

పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వర రావుగారు. పింగళి కాటూరి కవులుగా విఖ్యాతులు పింగళీ కాటూరి కవులు వెలువరించిన తొలికృతి 'తొలకరి' సౌందర్యనంద ప్రబంధంను' వీరు ఆవిష్కరించారు. 'మారుతిశతకం' అనే శతకాన్ని కూడ వీరు రచించారు.

సాహిత్యంలో పైన పేర్కొనిన జంటకాక వీరిని ఆదర్శంగా తీసుకుని అనేకమంది కవులు జంటకవులుగా తెలుగు కవితా పంటలు పండించారు

నామిని సుధాకరనాయుడు

తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాదు–4.

# పుస్తక సమీక్ష

ద త భా ర

ఈనాడు ప్రతివారు అవసరం ఉన్నా, లేకున్నా ఉద్యమ స్ఫూర్తితో ఏదో ఒక ఉద్యమాన్ని లేవ దీస్తున్నారు. అవి ఈ సమాజానికి ఏమివ్వగలదు అనే ఆలోచనకంటే ఆ పేరుతో మనం ఒక ప్రయోజనాన్ని పొందవచ్చుననే ఆలోచన ప్రధానం. ఆ ఊపులో వస్తున్న సాహిత్యానికి సంబంధించిన కవితల సంపుటే అకుల గంగాధర్‌గారు ప్రచురించిన 'దళితభారతి' ఈ సంపుటికి దళితభారతి అనేపేరు ఎందుకు పెట్టాలి, ఇంకో పేరు పెట్టలేము? ఎందుకంటే శీర్షిక కవిత ఇలా ప్రారంభమవుతుంది.

'దళిత భారతంలో
కాటికి పోయే కోతాలన్ని
కోస్తలు పడుతున్నాయి...

అసలు దళిత భారతి అంటే ఏమిటి ? దళితం అంటే ఖండింప బడినది, వికసించినది, విరిసినది, అలాగే 'భారతి' అంటే సరస్వతి (మాట,వాక్కు) భారతమాత, లక్ష్మి, పార్వతి మొదలగు అర్థాలు చెప్పుకోవచ్చును. ఇలా చెప్పుకొన్నప్పుడు 'దళిత భారతి' అనగా ఖండింపబడిన భారతి ఉదదు కాబట్టి—విరిసిన భారతమాత! వికసించిన వాక్కుగా భావించవచ్చును. ఈ కవితలో ఇవి ఏవి లేవు— దళిత పదానికి స్పష్టత లేదు, అర్థంలేదు. కవితంతా గజిబిజిగా ఒక వాక్యానికి ఒక వాక్యం సంబంధం లేకుండా సాగింది ఒక వేళ దళితులు అంటే అంటరాని వాండ్లు అనుకొన్నా వారికి సంబంధించిన కవితలు ఇందులో ఏవీ?—అయినా ఈ 21వ శతాబ్ద ప్రారంభంలో అభావం ఎక్కడుంది. అందరూ సమానం అనుకొంటున్న దశలో మనకు మనమే గిరిగీచుకొని కించపరచు

---

దళిత భారతి (కవితాసంపుటి)—అకుల గంగాధర్, ప్రతులకు రచయిత, అగ్రికల్చరల్ మార్కెట్ కమిటి కార్యాలయము, జగిత్యాల 505327 కరీంనగరం— వెల రూ॥ 10/- పుటలు 6 + 34)

---

కోవడం సబబుగాలేదు. ఇక కవిత్వం విషయంనకు వస్తే "అకుల గంగాధర్‌గారు గత ఆరు, ఏడు సంవత్సరాలుగా వివిధ సంఘటనలకు స్పందించి కవిత్వంను రాస్తున్నారు. జగిత్యాల ఉద్యమ ప్రభావానికి లోనై ఎన్ని బాధలు పడాలో అన్ని బాధలు అనుభవించారు. అయినా తాను నమ్మిన సత్యాన్ని కొరకకుండా ముందు కెళ్ళగలననే నమ్మకంతో రచనా వ్యాసాంగాన్ని కొనసాగిస్తున్నాడు అన్న సి. హెచ్. వి. ప్రభాకరరావుగారి మాటలననుసరించి గంగాధర్‌గారు కవిత్వంలో లీనమయి బాధల కొలిమినుండి ముత్యపుచిప్పలా బయటకు వచ్చినవాడని ఆయన కవితలు చాటి చెప్పుతున్నాయికొన్ని—

"సీకై ఆలోచించి గమ్యాన్ని వెదికినా
అది నాకోట్ల జనసమూహం ఆక్రందనలు

వీపు భక్తలేని జీవితం
ఈ వ్యవస్థకు ఓటిచ్చాం
గమ్యం నాదికాదు నీవుదిగురింప
చేసిన ఓ ఆశయానిది......"

(తడిముద్ర పుట–2)

ఈ కవితను ఇంతవరకే తీసుకుంటే 20 గొప్ప ఖండికలుగా నిలుస్తుంది. భావన మనను స్పందింపచేస్తుంది. మనసును పట్టుకుంటుంది.

''చిరిగిన బట్టల పేగుల
అతుకుల వద్ద బతుకులగల
ఆకలి జీవులతో ప్రయాణం
సగటు ఓటిశరీరం—''

('పేగులు'– పుట 64)

జన జీవితంపై పడే
లాఠీకర్రల మోత
హక్కుల రాజ్యాంగం పై
పడే రక్తపు ధార–'(ధార పుట 11)

గంగాధర్ గారి కవితల్లో చాలావరకు మినీ కవితలు బాగున్నాయి. అయితే ఆయన స్వయం కృషితో వచ్చినా, కవిత్వం ప్రచురించుకునే ముందు కవితలను సవరించుకొంటే బాగుండేదేమో! దాని వలన పుస్తకం చదివిన పాఠకుడు ఇంకా సంతోష పడేవాడు. కవితలు కేవలం అందించడం కాదు, మనం అనుకున్న భావం ఎంతవరకు స్పష్టతగా చెప్తున్నదనేది ముఖ్యం. కవితలు పేలవంగాను గజిబిజిగాను తికమకగా ఉండడం వలన పాఠకుడు చదవడానికి ఆసక్తిని ఎలా చూపెడతాడు.

శ్రీ ఆకుల గంగాధర్ గారి కవితా సంపుటికి రాసిన కంచె పోలయ్య గారి ముందు మాట వివాదాస్పదముగా వున్నది అంతే కాదు ఇతరులను కించపరచే విధంగా ఉంది. విజ్ఞానం అందరిసొత్తు దానిని అందరూ సముపార్జించడానికి అశవడినా, అది కొందరికి మాత్రమే పుట్టుకతో వస్తుంది. కొందరికి ఇతరులనుండి నేర్చుకుంటేనే అలవడుతుంది. రచయితలలో బ్రాహ్మణులు, దళితులు ఇతరులు అనేకమంది ఉన్నా దళితులు, బ్రాహ్మణులు అనుభావం అంటె అయిలయ్యగారికి కలగడం దురదృష్టం. 'దళితులకు కలంపట్టే హక్కులేకుండా చేసిన బ్రాహ్మణిజం ఘోరి కట్టబడుతున్న రోజులివి' అన్న భావననుండి వారు బయటపడి సహృదయతను పంచాలని ఆశిద్దాం. దళితముఖులు అవుతారని కోరుదాం దళిత అనే పదానికి వికసించినది, విరిసినది అనే అర్థం(చూ సూర్యరాయాంధ్రనిఘంటువు, పుస్తకాలకు వలసేముందు మాటల గురించి కూడా జాగ్రత్తగా ఉండాలి.

ఈ విషయం ప్రక్కకు పెట్టితే ఆకుల గంగాధర్‌గారి కవితలు చాలా బాగున్నాయనే చెప్పవచ్చును. ఆయన ముందు ముందు రచయితగా రాణిస్తాడనే నమ్మకం నాకుంది నాకృషి కురుతే కావ్యమే కదా!

డా॥ టి. శ్రీరంగస్వామి

# వార్తావాహిని

## అనంతపురం జిల్లా హిందీ అమృతోత్సవ మహాసభలు

అనంతపురం జిల్లా హిందీ అమృతోత్సవ సభలు ది. 20–11–94 న అనంతపురం గీతామందిరం నందు ఆనంద, ఆహ్లాదకరమైన వాతావరణమునందు జరుపబడినవి. సభలకు ద. భా. హిందీ ప్రచారసభ, (కేంద్ర) కార్యకర్తలు, ప్రాంతీయ సభ కార్యకర్తలే కాకుండా ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి కార్యనిర్వాహకులు, జిల్లాలోని ప్రచారక ప్రతినిధులే కాకుండా రాయలసీమ ప్రాంతములోని ప్రచారక అతిథులు, కూడా పాల్గొనిరి.

ఉదయం 9 గంటలకు జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ యం. సుదర్శనవర్మ (ఎం. ఎ. బి ఇడి) గారు జాతీయ పతాకావిష్కరణ గావించి, తమ సందేశములో' ప్రాంతీయభాషా దురభిమానము, వితనాతి మాతృభాషతో పాటు జాతీయ భాష హిందీని భక్తి, శ్రద్ధలతో నేర్చుకొనవలెననియు, భాషనభివృద్ధి చేయవలెనని నుడివిరి.

పతాక గీతాలాపన తర్వాత పతాక వందనము జరుపబడెను. ప్రధాన అతిథులకు, ప్రచారక కార్యకర్తలకు పరస్పర పరిచయం గావింపబడెను.

తర్వాత హిందీ ప్రచారక సమ్మేళన కార్యక్రమము జరుపబడెను. జిల్లా మండలి అధ్యక్షులు డి. పక్కీరప్పగారు, ప్రధాన అతిథులకు హార్దిక స్వాగతము పలికిరి. సమ్మేళన సభకు హిందీ ప్రచార సభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వర రావు గారు అధ్యక్షత వహించిరి. ప్రార్థనానంతరము, శ్రీమతి ఆర్. క్రిష్ణవేణమ్మగారు (జిల్లా కామన్ పరీక్షల బోర్డు కార్యదర్శి) జ్యోతి ప్రజ్వలన గావించి సభలను ప్రారంభించిరి. వారు తమ సందేశములో, జిల్లాలోని ప్రతి అప్పర్ ప్రయిమరీ పాఠశాలయందు తప్పని సరిగా హిందీ ఉపాధ్యాయుని నియమించవలసిన ఆవశ్యకతను వివరించిరి.

కార్యదర్శి టి. శ్రీనివాసులు మండలి కార్యక్రమాల నివేదికను సమర్పించిరి. ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ ఎన్. గంగయ్య (Msc Pld, Mplil) ప్రాంతీయ విద్యాశాఖా డైరెక్టర్, కడప) గారు, తమ ఉపన్యాసములో జాతీయ భాషను 5వ తరగతి నుండియే ప్రారంభించవలసినావశ్యకతను, హిందీ మాధ్యమంగా హిందీ మాధ్యమిక పాఠశాలలను నెలకొల్పి హిందీ భాషను నేర్పవలెనని హిందీ ప్రచారకులను ప్రోత్సహించిరి. సభకు

అధ్యక్షత వహించిన శ్రీబోయపాటి నాగేశ్వరరావు గారు తమ ప్రసంగంలో 'జాతీయ స్థాయిలో విశ్వవిద్యాలయ గుర్తింపును పొందిన ద. భా. హిందీ ప్రచారసభ. (మద్రాసు) ప్రస్తుతము జరుపుచున్న హిందీ ఎం. ఎ, ఎం ఫిల్, బి.యిడి నిష్ణాత్ అనువాద కోర్సులు కంప్యూటర్ కోర్సులు వైపు కోర్సులను గూర్చి వివరించిరి. తర్వాత హిందీ ప్రచారకులు శ్రీ ఎ.బి. ఉమాశంకర్ కె మురళీ, వై. యన్. యన్. రెడ్డిగార్లు మాట్లాడుచూ, తమ ప్రసంగాల్లో హిందీ భాషాభివృద్ధికి ప్రతి ప్రచారకుడు చిత్తశుద్ధితో కృషిచేయవలెనని హిందీని 3వ తరగతి నుండి ప్రారంభించుటకు

పదవ తరగతిలో ఉత్తీర్ణత పొందుటకు 30/ మార్కులు నియమించవలెనని హిందీ భాషా బోధనకు 5 పీరియడ్లు నిర్ణయించవలెనని ప్రభుత్వమును కోరిరి. యన్. కె. యు. విశ్వవిద్యాలయమందు హిందీ యమ్. ఎ. స్థాయిలో బోధించవలెనని కోరిరి.

సాయంత్రము జరిగిన హిందీ అమృత సభలకు అధ్యక్షత వహించిన శ్రీ. ఎ. రామస్వామి గారు తమ ప్రసంగంలో, హిందీ భాష కూడా, ఆంగ్ల భాష మాదిరిగా శీఘ్రగతిలో జన జీవనంలో ప్రవేశించుట కనుకూలముగా ఆధునిక పద్ధతిలో హిందీ భాషను బోధించవలెనని నుడివిరి. శ్రీ ఎ. బి. ఉమాశంకర్‌గారు అమృత సభల నివేదికలను సమర్పించిరి.

ఉపన్యాసకులైన శ్రీ ఎ. శంకరశాస్త్రి (కార్యదర్శి, ప్రాంతీయసభ, హైద్రాబాద్) గారు తమ వుపన్యాసంలో 'ద.భా. హిందీ ప్రచారసభ, మద్రాసు 75సం.లు పూర్తిగావించిన సందర్భంలో దక్షిణ భారతంలో జరుగుచున్న ప్రాంతీయసభలు, జిల్లాస్థాయి సభలను గూర్చి వివరించిరి, కనీసం 75 ప్రదేశములలో ఈ సభలను నిర్వహించవలెనని 75 లక్షల మందికి హిందీని నేర్పవలెనని (మౌలికంగా) చెప్పిరి.

శ్రీ కాజ వెంకటేశ్వరరావు శ్రీ బి. అంజయ్య గార్లు తమ వుపన్యాసంలో, 'ద.భా. హిందీ ప్రచార సభ (హైద్రాబాద్), ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి సంయుక్తంగా నిర్వహించుచున్న హిందీ ప్రచార కార్యక్రమాలను వివరించిరి.

ముఖ్య అతిథులైన డా॥ పి రమేశ్ నారాయణ (ప్రిన్సిపాల్, సాయిబాబా కాలేజ్) గారు తమ ప్రసంగంలో హిందీ సాహిత్యం, హిందీ భాషావిశిష్టతను గూర్చి వివరించిరి. జిల్లా స్థాయిలో జరుపబడిన హిందీ వ్యాసరచన, వాగ్వర్ధిని పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచి పెట్టిరి.

రాష్ట్రస్థాయి ప్రధానాచార్యులుగా ఉత్తమ బహుమతి పొందిన ప్రిన్సిపాల్ శ్రీ పి. రామకృష్ణా రెడ్డిగారు తమ ప్రసంగంలో, 'జాతీయ స్థాయిలో పార్లమెంటులో హిందీ భాషా ప్రాముఖ్యతను వివరించిరి.

అమృత హిందీ మౌఖిక పరీక్షలకు కృషి సల్పిన హిందీ ప్రచారకులతో పాటు హిందీ సేవ. లొనర్చిన హిందీ ప్రచారకులను శ్రీ బోయపాటి. నాగేశ్వరరావు గారు సన్మానించిరి. శ్రీ డి. పక్కీరప్పగారు, ప్రధాన అతిథులను సన్మానించిరి. తర్వాత గుంతకల్ రైల్వే ఉద్యోగులచే మానవతాకి పుకార్ హిందీ నాటిక ప్రదర్శన జరిగెను. శ్రీ ఎస్. ఎ. మహబూబ్ గారి వందన సమర్పణ తర్వాత జాతీయ గీతంతో సభ ముగిసెను.

# అనంతపురం జిల్లా అవమృత హిందీ మహాసభలు



ఆంధ్రసభ కార్యకారిణి సమితి సభ్యులు శ్రీ రాజ వెంకటేశ్వరరావు గారు
ప్రసంగిస్తున్నారు. ఇంకనూ ఈ చిత్రంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు
ప్రధానకార్యదర్శి శ్రీ ఎ.రామస్వామిగారు, జిల్లా విద్యాశాఖాధికారి యం. సుదర్శన వర్మ,
(ఎమ్.ఏ., బి ఇడి.,) శ్రీ ఎన్ గంగయ్య (యం. ఎస్. సి., పి. హెచ్. డి.)
ప్రాంతీయ విద్యాశాఖ సంయుక్త సంచాలకులు కడప, ఆంధ్రసభ
అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు ఉన్నారు.

